Jagannāthapandita, 18th Cent

Bhāminīvilāsamu

Kākināḍa, 1902

Record no. 303

## Bibliographic Record Target

జగన్నాథపండిత, 18th Cent.

భామినీవిలాసము / ఇది పండితరాయలను బిరుదుగల జగన్నాథకవిచే రచియింపఁబడి సంస్కృతగ్రంథమునుండి బులుసు పాపయ్యశాస్త్రిచేతఁ దెనిఁగింపఁబడినది.- 1. కూర్పు.- కాకినాడ : శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల, 1902.

(1), 30 p. :20 cm.

Record no. 303

Jagannāthapaṇḍita, 18th Cent.

Bhāminīvilāsamu / idi paṇḍitarāyalanu birudugala Jagannāthakavicē raciyimpam̐baḍi saṃskṛtagranthamunuṇḍi Bulusu Pāpayyaśāstricētam̐ Denim̐gimpam̐baḍinadi.- 1. kūrpu.- Kākināḍa : Śrībālasarasvatīmudrākṣaraśāla , 1902.

(1), 30 p. :20 cm.

Record no. 303

# BHAMINEEVILASAMU

*TRANSLATED*

*From the original Sanscrit of*

PANDITARAYALU *alias* JAGANNATHAKAVI

BY

**BULUSU PAPAYYA SASTRI.**

FIRST EDITION.

COCANADA:

PRINTED BY S. RAYULU, AT THE BALASARASWATI PRESS,
AND PUBLISHED BY THE AUTHOR.

1902.

Price. Rs. 0-4-0.





# భామినీవిలాసము.

ఇది

పండితరాయలను బిరుదుగల జగన్నాథకవిచేత

రచియింపఁబడిన సంస్కృతగ్రంథమునుండి

బులుసు పాపయ్యశాస్త్రిచేతఁ దెనిఁగింపఁబడినది.

మొదటికూర్పు.

కాకినాడ:

శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల.

1902

వెల రు. 0-4-0.] [కాపీరైటు.

శ్రీ

పరబ్రహ్మణేనమః॥

---

## కృతిసమర్పణము.

---

ఉత్పలమాల.

శ్రీహరిసేవ యా నెరులసేమముకై తనువొప్పగించుటం
చూహానెఱింగి సంతతపరోపకృతివ్రతమూని ధన్యుఁడై
శ్రీహరిపాదపద్మములచెంతకుఁ జేరినసాధుమాళికిన్
శ్రీహరికిన్ ననున్ దనయశేముషిఁ బెంచినమేనమామకున్.



వారిచే నుబిలాము గావించబడినది

౮-౮-౨౬

శ్రీరస్తు.

# భా మి నీ వి లా స ము.

## ౧ భాగము.

## ప్రాస్తావిక విలాసము.

---

తే గీ. శ్రీపరబ్రహ్మమునుమదిఁ జేర్చి డిల్లి । రాజరాడ్దత్తపండితరాజబిరుద
యుతజగన్నాథకవివిరచితము భామి । నీవిలాసము నిప్డాంధ్రీకరింతు.

క. ధారుణినతిమధురంబును । సారస్వతజలధిమథన జనితమునగుమ
త్సారకవిత్వామృతమ । వ్వారిగసుఖమొసఁగునానువారలకెల్లన్. 1

తే. మత్తకరులెల్లనాశాంతవృత్తులయ్యెఁ । గరిణులు దయాస్పదములు, మృగమ్ములసమ
శీలములు; భువి నెవరిపై సింహమిపుడు । ఖరనఖమ్ములపాండిత్యగరిమఁ జూపు? 2

మ. మునుపుత్ఫుల్లసహస్రపత్ర వితతిప్రోద్యత్పరాగోత్కరం
బున సౌరభ్యముఁ గన్ననీటను సరోముఖ్యంబునన్మానసం
బుననున్నట్టిమరాళభర్త యిపు డెప్పోల్కిన్వసింపంగనే
ర్చును భేకాకులమైన పల్వలమునన్ బ్రోన్మిశ్రపంకాంబులన్. 3

ఉ. తూరుపుఁబట్టు దప్పిగొని తొందరచూపులతోఁ జకోరముల్
కైరవముల్ వికాసమునుగాంచెడి, మారుఁడు విల్లుదాల్చెడిన్
వారిరుహాస్యలన్విడిచి పాఱఁగఁ జూచెడి మాన, మిప్డు, డో
నీరజసూతి, చందురుని నీరదపంక్తుల నేలగప్పెదో. 4

ఉ. ఓవికచాంబుజంబ, ముదమొప్పభవద్విగళన్మరందమున్
ద్రావెడిభృంగమింపగు విధంబున జుమ్మనిపాడుఁ గాక; నీ
తావులనెల్ల దిక్కులను దానొక కోర్కియులేకయే కడు
స్వీవఁగనేగువాయువిఁక వేఱువిధంబగుచుట్టమాఁ గదా. 5

క. నినువిధివశమునఁ జేరిన । దనిభృంగము నెడలఁ, గుటజమా, యవమానం
బునుజూపకు; మధుపూరిత । వనజాతంబులకునద్ది బహుమాన్యమగున్. 6

క. అలికులసమాకులంబై । యెలమావితలిర్చునఱఁదు నెందేనియుఁ, గో
కిలమా, నీరసదివసం । బులనువనాంతరమునందుఁ బోయికడపుమా. 7

క. రసమెఱుఁగని కొంగలచేఁ । బొసఁగెఁ దిరస్కారమనుచుఁ బొగులఁగనేలా?
భసలములు మధురసజ్ఞము । లెసఁగుతఁ జిరజీవులగుచు నెపుడుఁ గమలినీ. 8

క. అతినీచమైతిననుచున్ । వెతనొందకు మెప్పుసుగాని, పెనుకూపంబా;

సతతము సరసహృదయమవు। నితరగుణగ్రాహివగుచు నెనసెదుగానన్. 9

క. ఘనమధుసంభృతవికస। ద్వనజాతమునందుముందు వాసరములు వే
డ్కనుగడపినభృంగమునకు। మనసెట్టులుకుటజమునకు మరలెనొ, యహహా! 10

క. ఓమలయజమహీరుహమా,। నీమహిమము నెవరు పొగడనేర్తురు భువిలో?
నేమియన, విషముఁ గ్రక్కెడు। పాములఁబోషింతు సౌరభంబు వెలుచుచున్. 11

క. కనఁగలరేయెవరును, జం। దనభూమిరుహంబ, యుష్మదలఘుమహిమమున్?
నినుఱాతనఱుగఁ దీసెడు। జనులకుఁ, బొడియయ్యు, నిడుదు సౌరభపుష్టిన్. 12

క. ఓరాజహంస, నీర। క్షీరవివేకోద్యమంబు సేయక నీవే
యూరకయుండిన, నిలనె। వ్వారుభవత్కులమొనర్చు పనిసేయుదురో. 13

క, జనులొకకొందఱు, వెలికిన్। సునిశితకరవాలధారచొప్పున నహికం
బెనుగ్రూరులగుచుఁ, గేవల। మనుపమకరుణాప్రపూర్ణులై యుందురులోన్. 14

క. అరవిందమ, తేంట్లుభవ। న్మరందమును దనివిదీరఁ ద్రావి మొఱయుఁగా,
కొరుఁడు ప్రవీణుఁడు లేఁడిలఁ। బరిమళములు దెసలనెఱపఁ బవనునికంటెన్. 15

చ. వేగము నేనుదీక్ష్ణ మగు వేసఁగియెండలనెండ, వేడిచే
నేగఁగనెద్ది తావొకద యీపయిఁ బాంథుల, కన్మనోవ్యథ
స్గ్రాగుచు, మార్గమధ్యమునఁ గ్రాలుకొలంకులజీవనంబులే
యాఁగదధన్యముల్, తలఁపనంబుధిజన్మమదేలకాల్పనా? 16

క. కొలనా, నీవెండినఁ, బ। క్షులుగగనతలంబుఁ బట్టుఁ, గూజద్భృంగం
బులుసేరురసాలసుమ। మ్ములు, నీఁకనతిదీనమీనములగతియేమొ. 17

క. జలజిని, మధుపమునందుం। బలెవాయువునందు సౌరభవిలోభంబుం
దలఁపకు; ఘనుఁడయ్యును, లో। కులమోపముకొఱకె, యాచకుండతఁడయ్యెన్.

క. మాలతి, మానముఁ బూనకు। మాలలితరుతుల్ మిళిందమాలాపింపన్;
దాలుచువదాన్యగురువులు। మాళిస్సురతరువులెంతొ మన్ననదానిన్. 19

క. మలయజమా, గుణనిధివై। చెలఁగునినున్ జేరరానిస్థితిఁ ద్రోయుద్విజి
హ్వాలనుంభరించెదవు, మా। కలవియెయెన్నంగఁ దావకౌన్నత్యంబుల్. 20

క. వనమఖిలముఁ దిరిగెను, రో। సెను మధుపంబెల్లయెడలఁ జెట్లన్నియు, నీ
కెనయగు వృక్షమ్మును గ। న్గొనఁ జాలనిదయ్యెనెందును, రసాలంబా. 21

క. పరపరిమళకథమూలే। కరించుసురతరులవిరులఁ గాలూనియు, నీ
వరయుదు వేనిప్రసూనాం। తరముల, నోమధుకరంబ, ధన్యంబ, వహో. 22



క. పావనవయి వింధ్యజవగు। నీవెండుచున్నయప్పుడేనియు, నేఱా,
భావింపుతడవు తగునే। మోవీథులఁ బాఱునీరమున్లోఁగొనుటల్. 23

క. ఫలపత్రపుష్పలక్ష్మి। న్వాలయఁగనినుఁగాన మెపుడు, పృథుకంటకసం
క్తులనిండియుండు వేయా। శలతోడన్నిన్నుఁ జేరఁజను, నోతుమ్మా. 24

క. కోకిలమా, నీవివ్వని। నేకంబవు, కూయఁబోకుమీమధురముగాఁ
గాకులు నిష్కరుణంబులు। నీకాపదసేయకుండ నిజకులశంకన్. 25

క. తరుకులశోభంగాల్చుచు। ధరఁబ్రాణులకార్తిఁ గూర్చితగుమంచునసే
సురుచిరగుణముంగని, భూ। ధరరాజమ, శిరమునందుఁ దాల్చెదుదాసన్. 26

క. కలభంబా, నినుఁజేరిన। యళినవమానింపఁబోకుమాయెన్నండున్;
ఇలదానమహితదంతా। వళిముల్నుద్దానినెత్తిపైఁ బెట్టుకొనున్. 27

క. సురధరణీరుహసుమనః। పరిమళసేవాఖిలార్థపరిపూరణమై
పరఁగడితేఁటికిఁ గుసుమాం। తరసేవనమిదివిడంబనము కేవలమున్. 28

క. కోకిలనికరమునడిగెను,। లోకంబున నెల్లతరువులుంగనె నైనన్
నీకెనఁగనలేదయ్యెను। మాకందమహీరుహంబ, మధుపంబెందున్. 29

శా. ఆరామాధిప, స్వల్పతోయములతో నైనం, గృపాత్ముండవై,
ఘోరంబైననిదాఘకాలమున నీక్షోణీజమందీవుచె
న్నారంజేసితివెట్టిపుష్టి, యదిసేయంజాలునొక్కో జలా-
సారంబుల్ నేలుదిక్కులన్నెఅపువర్షావారిదంబేనియున్. 30

మ. ధరనిస్సారము; దిక్కులంబొదివెవాత్యల్; చండమానెండదు
ర్భరమయ్యెన్; మతిహీనుఁడయ్యెను వనీపాలుండు; సంపంగికి
న్మరుభూమిన్లయదంబెసర్వమిటు, లైనన్, దోఁపఁజేసెంబయో
ధరవర్యా, యమృతంబుఁజిల్కెడినినుందాబ్రహ్మయెందుండియో. 31

మ. విగళద్దానమిళన్మిళిందమగు కుంభివ్రాతమెచ్చోటని
ల్వఁగలేదోభయలోలనేత్రమయిపూర్వ, మ్మాలుకన్మౌక్తిక
మ్మగుద్వారమ్మున నిప్పు, డమ్మృగకులాధ్యక్షమ్ము సింహమ్ము స్వ
ర్గగతమ్మౌట, నయో, సృగాలములుసంరావంబుగావించెడిన్. 32

క. తరులన్నిటియెడఁ దుల్యా। దరుఁడైవనపాలుఁ డెమ్చునయవకుళమునం
బొరయింపఁ, డైననదిసుమ। పరిమళముల దెసలనళిరవంబుల నింపున్. 33

చ. వలమగుమ్రానుబంధననిబద్ధము; గొమ్మలు మెంకుదిట్టలున్,

నిలయమగమ్యపర్వతము; నీకు భయంబెటు? గాని, యీదవ
జ్వాలను, జ్వాలలంబలుపువాఁడు, కృపారహితుండు, ఘస్మరం,
డలుకడరించు నా మనమునందొకరుండు, మహీజరాజమా. 34

చ. జలజహితుండు గ్రీష్మమునఁ జండకరంబులమండఁ జేయఁగా,
జలదమ, నిన్దలంచుచును జాతకమెట్టులో దీర్ఘవాసరం
బులుగడపెన్; లభించితివి పుణ్యమునన్, వడిగండ్లరాల్చుని
స్తులకృపఁబూనితే, నెవరితో నిఁకనిప్పుడు సెప్పనొప్పనో? 35

క. పరిగళితలతాతతియై తరునికరముదావకీలవర్గముగాఁగన్,
గిరిశిరములఁగురిసెదు, జల ధర, మెండుగ, నేమిశ్రీమదమొసీ, కహహా! 36

క. మునుభీకరగర్జితముల్ విని, పాంథుఁడ, మనమునందు వెఱపందకుమీ;
వినవో, జగదార్తివారణ! మునకుంజీవనమదానముం జేయుఘనున్? 37

చ. నిరుపమమొంపునీచలువ, నీదగుకీర్తి దిగంతవర్తి, త్వ
త్పరిమళమున్ ద్రిలోకవిదితం, బయినన్, వినుమొక్కమాట, యీ
వరగుణపంక్తి నెల్లవిషపానకకేళులఁ గ్రక్కుకోటరాం
తరసముపాశ్రితోరగవితానము మ్రింగుఁ, బటీరభూజమా. 38

తే. గీ. లేదపేక్ష; దాక్షిణ్యములేదు; ప్రీతి లేదు; సంగతియైనను లేదొకింత
అట్టులయ్యును, నున్నతుండైన ఘనుఁడు తాహరించును లోకులతాపములను. 39

చ. రమకిరవైన, నిర్మలసరస్సునఁబుట్టిన, నిందిరేశుహ
స్తమునవసించినన్, సురలఁ దావులరంజిలఁ జేసినం, దద
న్యములగుసద్గుణంబులిఁక నన్నియుఁ గల్గిన, నబ్జమా, ద్విజో
త్తమమగుహంసయందు రతిఁదాల్చిన నున్నతి యద్దియాఁజుమీ. 40

ఉ. తీరమునందుదొర్లెడిని దివ్యమణుల్ వడిగ్రావపంక్తితో,
నీరచరాళితోడ హరినిద్రను జెందును నీజలంబునన్,
క్షీరమహాంబుధీ, యిటుల నీయవివేకము నీమహోన్నతిన్
ఆరసినింద సేయుదునొ, యట్టులు గాక నినున్ స్తుతింతునో? 41

క. ఏలాయీరత్నంబులు? ఏలా నీలాభ్రసదృశ మీనీమేనున్?
ఓలవణాంబునిధీ, చోరఁ జాలదు నీనీరుతృషితజనములనోరన్. 42

ఉ. ఇంతటినీరసంపద వహించియు సార్థులతృష్ణ దీర్పనో
క్కింతయు నిష్ఠ వేగపడవేని నిదాఘమునందుఁ బద్మినీ



కాంతుఁడు సర్వలోకములుఁ గాల్చుచునుండ, సరోవరంబ, నీ
వెంతయుఁ జిక్కిపోయి, యపుడెవ్వరి తృష్ణను మాన్పనేర్తువో? 43

క. అలిగెదవు, లేనియెడలం బలుకుదు నే నొక్కమాటఁ, దద్వ్యాచకుఁడౌ
జలదుఁడు విడిచిన నీరం బులనేనియు నీవువిడువవు, మహాంభోధీ. 44

తే. గీ. వానకాలపుటేఱు, గంగానదీప్ర వాహమునుఁ జేరఁ జనునిను వలనదనము,
గానియద్దానిముందు రంగత్తరంగ తతులఁ బ్రకటింతు, వదినీకుఁ దగదుసుమ్ము. 45

చ. అమరులునందనమ్మున సురాగసుమంబుల, నెద్దియానఁద్య
క్తములగువానినే, యెపుడుఁ దాము సు మూర్కొనుచుంద్రొయ మ్మిళిం
దము మధుకాంతుఁ జేసి, నినుదైవవశంబునఁ జేరినంత, లో
భముఁబ్రకటింతువేని, నిను, వారిజమా యిఁక నేమి పల్కుదున్. 46

తే. ఎందలిమృణాలముల్ భుజియించి, జలముఁ బీల్చి, యంభోజములను సేవించినావొ,
అట్టికాసారమునకు నేమైనమాఱు మేలుగావింపఁగలవె, మరాళవర్య? 47

మ. భ్రమరంబా, మధుమాసవాసరము ప్రారంభంబునం, దేనిపు
ష్పములందాడుచుఁ బాడుచుత్సవముమించం జేసితో, యారసా
లమహీజాతము, దైవయోగమున, లీలంబాయ, మర్యాదవే
గముగావీడుదువేని, తుచ్ఛమిఁకఁ నీకంటెన్ మహీదిమ్మహిన్? 48

మ. హరిణీసంఘములోన నీవు గురుగర్వాంఘుండవై యిప్వనాం
తరమందేటికిఁ, గృష్ణసార, విహృతిన్గావింతు? నిర్భిన్నకుం
జరకుంభోద్గతనవ్యమౌక్తికవిరాజన్మార్గమైనట్టిభీ
కరపంచాస్యవిహారభూమి యిది నిక్కంబంచు నూహింపుమా. 49

క. పేరఁకలినవసియు, గజ వైరియగు మృగాధిపుండు, భయరహితంబై
చేరువఁ దిరుగుచు నున్నను, సారంగకులంబు నెట్లు చంపఁగనేర్చున్? 50

క. కరికుంభంబులఁ జీలిచి ధరఁ దన్మౌక్తికవిభూషితం జేసినయా
హరినేఁడు చెప్పఁ గలుఁగును హరిణంబుల యెదుటఁ దనపరాక్రమ, మకటా. 51

మ. కరియూథేంద్ర, మదాంధలోచనుఁడవై, కార్కొన్నయిక్కాననాం
తరభూమిన్ వసియింప కొక్కక్షణమైన న్నీవిఁక, న్నెచ్చెలీ,
హరినాథుండు మహత్తరోపలనికాయంబు న్నఖాగ్రంబులన్
ద్విరదభ్రాంతినగల్చి భూధరగృహన్నిద్రించుచున్నాఁడిటన్. 52
గిరిగహ్వరములఁ దిరుగకు గురుగర్వముతోడఁ, జంటికూనయయిన యా

హరిశిశువులేచినన్, భువి। కరిణీశేషంబెయగును, గజశాబంబా. 53

చ. భువినినిసర్గమార్గమున భూరుహసంతతిఁ బెంచుచున్, నిజో
పవనమునన్ వనీవిభుఁడుపాఁతెనుదా; వకుళంబునొక్కెడన్
ఎవఁడెఱుఁగంగనోపు నది యేకొసనోపడియుండి దిక్కులె
ల్లవికచమంజరీసురభిళంబులుగా నొసరించునంచెవన్? 54

ఉ. ఏయదియిట్టటుంగదల నెల్లెడఁ దుంగతరంగవిభ్రమం
బాయతమందరభ్రమణమన్భ్రమ దిక్కరిమానసంబులన్
జేయునొ యట్టిరాఘునము స్ఫీతతిమింగిలభక్షణక్షమం,
బేయెడఁజల్పుఁ గేలిఁగలహించి పయోనిధిఁబాసియేగినన్? 55

ఉ. కాననమందుఁ గొంతగజఖాదితమయ్యెను, గొంతమంచునన్
న్యూనతనొందెఁ, దక్కినదియూష్మమునన్ ఖరభానుతప్తమై
మ్లానతనొందె, మూలఁబడి మంగళసౌరభ మెల్లదిక్కులం
దీనెడియాలవంగలత నేర్చ దవానల, మక్కటక్కటా. 56

ఉ. మానితదేవలోకసుషమాకరమైతివి, కల్పభూమిరుట్
స్థానమవున్ శచీంద్రసుకృతంబుఫలంబవునైతి, సత్యమే,
కాని, సతంబు, నందనమ, ఖాండవమేర్చిన పావకుండుదూ
రానమెలంగెఁగాకయని ప్రార్థనసేయుదురాప్తులవ్విధిన్. 57

చ. జనులుస్వకీయకార్యముల సందడినుండి నన్విడఁగఁద
ల్పునుగొనముక్కునంబొడిచి పోయెదఁ బంజరమున్ దొలంగినే,
ననుచుశుకంబభీప్సితమధూమృతమానుచునుండ లోనికిం
జనియెను హస్తిహస్తసదృశంబగు సర్పవరేణ్య, మక్కటా! 58

ఉ. శైలతటంబులన్మెలఁగు చంచలచిత్తమృగంబులార, మీ
రేలతరంగసంకులము నీతటినింజొరఁబూనినారు? పా
తాళముఁ జేరె నిండె ద్విరదప్రభు వుచ్చలదంబునిర్భరా
లోలములైన పెన్మడుగులలోఁబడి గండశిలావిధంబునన్. 59

ఉ. ఓమృగరాజశాబమ, మదోత్కటకుంజరబుద్ధిదిక్కులం
దేమిటి కాగతింబరుషదృష్టినిగిడ్చెదు? త్రాగుస్తన్యము;
స్థామములైన సర్వభువనంబులతాపమునెల్ల నార్చుచున్
శ్యామవినూత్నమేఘమిది సల్పుచునున్నది ధీరగర్జలన్. 60



క. జలధరమ, ధీరగర్జలు। సలుపంగాఁబోకు; మదగజములను బుద్ధిన్,
నెలగడచిననాగర్భము। చలించుచున్నయది నాదుజఠరములోనన్. 61

క. కొనగోళ్ళమత్తగజముల। ఘనగండస్థలులఁ జీల్చుకౌశలమును నే
ర్చినహరి హరిణంబుల కే। మనితెలుపంగలదు తనపరాక్రమ, మకటా! 62

చ. అమలజలంబులం జనితమైయువతీముఖసామ్యమంది, దై
త్యమథనుహస్తమందమరి, తావులదేవముదంబుసేసి, కా
వ్యములకుశంబరారికఖిలార్థమవై, తగునీ, కహో, పయో
జమ, మధుపాళిఁ బ్రీతికొనసాగినచో, నిఁక నేమియందునిన్. 63

క. కరిరాజ, కనులమోడిచి। యుంటసుఖమున నిట్లునిద్రనొందెదవేలా?
పరిణామవిషమమగుకే। సరితోఁ బగ పెచ్చుచున్నజాడం గనుమీ. 64

తే. తగనితొందరతోఁ బండితప్రకాండ। వదనములనుండి మాఁటలావలకుఁ బోవు;
పోయెఁబో మఱి వెన్కకెప్పుడునురావు; । సమవదంతావళముల దంతములపగిది.

మ. కలశాబ్ధిం జననంబుదారత త్రిలోకకఖ్యాతి, మావాసమున్
విలసన్నందనమందుఁ దావిదివిషత్ప్రీతిప్రదం బిట్లుక
ల్పలతానామకదాతృముఖ్యగుణముల్సర్వోత్తమంబుల్ సుమీ
కలదేనొక్కవివేక మర్థివరకాంక్షల్ దీర్చుచో నెంతయున్. 66

ఉ. నమ్మినప్రాణికోటుల ఘృణారహితాత్మతఁ ద్రుంతునంచు డెం
దమ్మునఁ జింతపూనియనుతాపమునొందకు, వ్యాధ; దొడ్డనే
త్రమ్ముల, రాజసన్నిధులఁ, దార్కొనరే, నినుఁబోలె గూఢభా
వమ్ములతోడ, సాధుగణవైరిజనుల్, ఖలు, లెంచ లెందఱో. 67

తే. మధురవాగ్గుంఫనముల నమ్రతదలిర్ప। సాధుజనులనమ్మించి వంచనముసేయు
వారినిన్ భరియించెదు, పాఱిపోయె। నీవివేకంబుగూడ, భూదేవి, తల్లి. 68

చ. అనుపమమౌ జగద్ధితమయుం బగుమానసవృత్తి, కేవలం
బనుపమితంబగు స్మృతియు నద్భుతవాగ్రచనావిలాసమున్,
అనితరసాధ్యమౌ గృతియు, నాకృతియు న్సుమనోమనోజ్ఞమౌ
జనులఁ బండితోత్తముల సర్వముమాటల కందరానిదై. 69

క. ఘనుఁడగుమనుజుండిడుమల। నెనసియును నపూర్వమహిమనిలఁ బ్రకటించున్
అనుపమపరిమళమును నెఱ। పును కాలాగురువుదహనమున దగ్ధంబై. 70

క. లలితగుణాన్వితులగుని। ర్మలచిత్తులయలుక గూడ రమణీయమె యౌ

వెలయును రమ్యంబై పరి। మళభరితంబైన కుంకుమముకాంచంబున్. 71
శా. కేళీలుంఠితశారదానగరలక్ష్మీమండితుల్ పండితుల్
గాంగ్రిలన్ బ్రౌఢసరస్వతీసదననిర్యత్క్లేశచోరుల్ జడుల్
ప్రేలన్ జాలిన నెత్తిఁ ద్రొక్కి ఫణిరాడ్వేదండసింహంబుల
న్గాంచన్ బాలశకుంతముల్ శశములు న్శ్వానంబులున్ జెచ్చెరన్. 72
క, గురువుల పరుషవచనములఁ। దిరస్కృతిని జెందిమహిమఁ దేలుదురు జనుల్;
వరమణులు సానపట్టగక। నరనాథుల శిరములందునన్ మెలంగవు గా- 73
తే. చందనము వహియించును జందఘనుల। దీపమాపలఁ దాల్చు మషీపటలముఁ
బూర్ణచంద్రుండును గళంకమును ధరించుఁ। బృథివిపతిభరియించును బిశునజనుల- 74
క. కోరంబడకయె సుజనుఁడు। దారచరిత్రమున జగముఁ దనుపును; శశియె
వ్వారడగినఁ దనకరములఁ। గైరవిణీకులమునకు వికాసంబొసఁగున్- 75
క. పోసినపాలం బోలె। జేసినమేలెడ్డులేక నెఱిఁగుడిచియు వే
వేసమకట్టును జంపుట। కై సర్పసమానుఁడయినఖలజనుఁ డిలలోన్. 76
చ. విడిచివివేకమున్ బరిఢవిల్లఁ బఠించి నుతుల్ సహించిక
ట్టిడుమలు దుర్లభంపుఁబదమేని పేఁ గూర్చిరివాఁడటన్ దిరం
పడియిపుడమ్మహావకృతిపంక్తిఁ నలంపక క్రూరచిత్తుఁడై
యెడదవిరోధభావము వహించిన నెన్వనికేమి చెప్పదున్? 77
తే. జగములో మానవు లపాయశంకఁ జేసి। దూరముననే పరిత్యజింతురుసతంబు
ఖలజనునివానికపటము కారణమున,। విషముకతన నాశీవిషవిభునిఁ బోలె. 78
తే. స్వార్థమణఁచి పరార్థసంసక్తియందు,। నెనసిగుణభూతవస్త్వభేదైకతాప్తిఁ
దనరనంతస్స్ఫురితమైయుదాత్తమహిమ,। తత్పురుషవతంసముసమర్థతఁ దలిర్చు 79
తే. జనుఁడు, వంశజుఁడును గుణశాలియైన। జెంపుఁ బూజను సంగవిశేషముననె;
అవనిఁ దుంబీఫలాపేతమైనవీణ। కట్టిమహిమను గాంచదుగాదె యెపుడు. 80
క, ఒకదోషమున్నచో, గుణ। నికరముగలవస్తువైన నిందం జెందున్,
సకలరసాయనమహితా। త్మకమయ్యును బాడుకంపుమై నుల్లివలెన్. 81
క. తానాపదపాలయ్యు। న్మానకమేల్సేయుసుగుణమహితుం డెపుడున్;
దీనికిమూర్ఛంబడిమృత। మైనట్టిది పారదం బుదాహరణమగున్. 82
మ. వనసీమన్విహరించుచున్ శశకడింభంబు న్వెసంజూచితో
డనభీతాత్మకయై భయంబులను జెందంజాలు ప్రాణేశు చెం



తను జేరంజను సీత, రావణునిచేత న్నీతయై, ఘోరదం
ష్ట్రినిశాటాళి పరీతయై వివశయై ప్రాపించెడిన్ దుర్దశన్. 83
ఆ. వె. బీరమెంతొ పలికివేల్పుల యెదుట, ము। క్కంటినేయ వింటెసంటుటయును,
వేల్పుచెలులకనుల విందగు మరుమేను। కాలిబూదియయ్యెఁ గంటిమంట. 84
తే. శాఖిశాఖలు పేశలాశనములగును,। చీత్కృతి పరంపరలు సుభాషితములగును.
తీవ్రనఖదంతదళన మాతిథ్యమగును; తగునుగదయిది మర్కటాధముల సభల. 85
ఉ. ఏయదితర్క? మచ్ఛమతి? యేయదితీర్థము? విష్ణుభక్తియే;
యేయదిశాస్త్రి? మెద్దివిననేగునొ ద్వైతతమం, బదేసుమీ;
యేయది మేలొనర్చెడి సుహృద్వర? మాత్మమహావబోధమే;
యేయదిదుఃఖమిచ్చి యలయించెడి శత్రువు? దుష్టవాసనల్. 86
క. ఎనయఁడు సాధుత్వమును। గ్జనుఁడిల వేదాంతవిద్య సకలమెఱిఁగినన్,
వనధింజనమగ్నంబ। య్యును మైనాకంబు మృదుతనొందని మాడ్కిన్. 87
క. పరమెపుడును నైర్గుణ్యము,। ధరగుణగౌరవముఁ దాల్పఁ దగదెవ్వారున్;
పెరుఁగు నితరభూమిరుహా। త్కరము, పటీరద్రుమంబు ఖండితమె యగున్. 88
ఆ. వె, అలపరోపసర్పణానంతచింతాహు। తాశనజ్వలచ్ఛిఖాశతమున
నంటఁ బడని యంతరంగంబు లొప్పార। బ్రతుకుసాధురీతిఁ బాపపములు. 89
క. తనగుణసంతానముచే। తనువివరంబులను గప్పిదాఁచుచు, శూన్యం
బున, సైతము గుణవత్త్వ, మ్మొనరించుచు, సుజనుఁడొప్పు నూర్ణాయుగతిన్. 90
క. ఖలజనుఁడు సుజనతూలం। బులఁ బ్రోచుటలోననగ్నిఁ బోలినవాఁడ,
న్యులదుఃఖవహ్నినార్పఁగ। నిలవాయునిభుఁడు, పొగడ నెవ్వండోపున్. 91
క. పరగుహ్యనిగూహనత। త్పరము, గుణియు, లోకవాంఛితము, నాలలితాం
బరముం బోలిన సుజనో। త్కరమున్ ఖలజనుఁడు మూషికమువలెఁ జెఱుచున్. 92
ఆ. వె. స్వచ్ఛమహితకీర్తి సౌరభ్యలశునంబు,। శాంతిశిశిరతా కృశానుమూర్తి,
సదయ భావకుసుమజలధరమార్గంబు। ఖలుఁడు, సుజనదుఃఖకారణంబు. 93
తే. పుష్పఫలపత్రచయభారమును వహించి। శైత్యపీడను ఘర్మరుజన్ భరించు,
నన్యహితమున కాత్మదేహంబునిచ్చు,। నట్టితరువును దెలతు నౌదార్యగురువు. 94
క. కాలాగ్నిన్ ముద్దుగొనన్,। వ్యాళాధిపుఁ గౌఁగిలింప, హాలాహలముం
గ్రోలం, జూతురు, దుర్జను। నోలిన్వశపఱుచుకొనఁగ నూహించుజనుల్. 95
క. కనఁబడెనీదు వివేకము,। వనవము, దుర్మదము, పేదవారలకడు నెం

డిన చేలవిడిచి యున్నతి। నెనసి గిరులపై నుదారవృత్తి నెఱపుటన్. 96

ఆ. వె. అవనిగిరులు గురువు, లంతకంటెను నుర్వి। గుర్వి, దానికంటె గొప్పజగము,
అంతకును మహాత్ములగువారు గురుతరుల్,। వారుస్థిరత విడరు ప్రళయమునను. 97

తే. విత్తనములాకసంబున విత్తినట్లు। వాయువున రమ్యచిత్రముల్ వ్రాసినట్లు;
గీటులను నీటిమీఁదను గీసినట్లు,। ఖలునిపట్ల సత్కారము సలుపుటెల్ల. 98

క. వానరమున కేయజ్ఞుం। డేనియు వక్షమున హారమిడుచో, నదియు
ద్దానిన్నాకను మూర్ఖుఁడు। బీనాసనముగను ముణిఁచిపెట్టుకొనుఁగదా. 99

క. మలినుఁడవు జడ్ఁకుఁడవుఁజ। పలుఁడవునయ్యు, నెటు, రాగవతియును విలస
జ్జలజాస్యయు సరసయునై। వెలయు సరోజినిని నీవువిడిచెదు, భ్రమరా? 100

క. ధనికకడ జనుఁడుతనకై। ధనముఁగొనన్మోము మలినతంగనుటరుదే?
వనధికడజల మొరులకై। నను గైకొను మేఘమెల్ల నల్లనిదగుఁగా. 101

గీ. జన్మమన్నను దుర్గమశైలమందు;। జాతియన్నను గాష్ఠంబు, సంగమన్న
భుజగములతోడ; నైనను, బొందితీవు। స్వగుణగణమున మహిమంబు, జందనంబు.

ఉ. ఏమిటికో మహాత్మ గడియింపఁగఁ బూనెదు సద్గుణంబులన్?
నీమహిమాప్తి కేని, విను నేనువచించెద నొక్కపథ్యమున్;
ఏమహనీయవస్తుతతి యెంతయు శోభనమై యెసంగునో
యీమెయి వెంచుచున్నకలి యెప్పుడు దాని నెమిగ్రింగెడుం జుమీ. 103

గీ. దెసలుపొగగమ్మినట్లొప్పు, దేహమగ్ని।వోలె దళితాబ్జములు వాయువులు దహించుఁ,
గోవెలను సన్నువిడిచిన, నోవసంత,। పాన్థతామ్రదళామ్రగుంజద్ద్విరేఫ. 104

క. కరటిభ్రమమున గిరుల। న్గరివైరి మహాప్రతాప నఖరాగ్రములన్
ఎరకయి చీల్చియు మాంసముఁ। బొరయదు ప్రతికూల దైవమున నించుకయున్. 105

గీ. ఆలకించి గర్జితము, నిశార్ధజాత। మయ్యుఁ దళ్లుకరంగట హరికిశోర
ముఱుక వేవేగ నంగంబులాదుగ ముడిచి। యించుకయు సడి గాకుండఁ బొంచియుండు

క. ఖల, దివ్యమతీ, యేమని। పలుకుదు నీసుగుణపక్షపాతంబును; ని
ర్మలతమగుణ సాధుజనం। బుల, తేఁయియుఁబవలు, మఱచిపోవెన్నండున్. 107

క. ఖల, నీచరితము విద్వాం। సులయెదుటన్నిర్ణయించుచుం జెప్పెదఁ, గా
క, లపాపకథావిధమునఁ। దెలిపినదేచాలు, దుర్మతీ, పాపాత్మా. 108

క. ఆసంపద్భృగనికాయవ। వానలము, సుశీలభూరుహ గజేంద్రంబున్,
జ్ఞానప్రసేపచంపము। హానిల, మదిపిశునజనసమాగమమరయన్. 109



క. ఖలులయిన వారలెంతయు। వలఁతులు సాధుహితకార్యభంగమునందున్,
ఇలనిర్ఘోషుల ప్రాణం। బులను హరింపంగ సర్పములు కుశలంబుల్. 110

క. నాలుక నెపమున నిల్పె। న్వ్యాళింబన్మజుఁడు ఖలులవదనము లందున్,
ఏలా, కాకున్నన్, జనుఁ। డీలుగు, నదిముట్ట, మంత్రహీనుండగుచున్. 111

క. ఒనరించితి వీవెంతయు। ఘనకార్యము, మంచిపేరు గడియించితి, వో
యనుఁగుఁజెలికాఁడ, దీవిం। తునువద్దయు నేనునినుఁ బ్రతుకునన్నాళ్లున్. 112

క. నిరతపరకార్యపరస। త్పురుషులపలుకులు సుధామధురములు, మనముల్
శరనిధిగంభీరమ్ము,। ల్శరదిందువికాస నిర్మలంబులు యశముల్. 113

క. పునరుజ్జీవితముగఁ జే। యును జైత్రుఁడు వచ్చుచ్ఛిరోపహతరుత,
మ్మనిత్తలఁచుచున్నకోకిల। మును వ్యాధుండేసె హృదయమున నొకకోలన్. 114

క. సురుచిరగుణహీనుండగు। నరుఁడు మహాడంబరుఁడయినను శోభింపం,
డరసినయంతనె శోభా। స్ఫురితములగు పూలవెలుఁగు బూరుగుభంగిన్. 115

గీ. బురదలేక కొలను పొలుపొందు నెంతయు,। సభదలిర్చు పిశునజనులఁదొఱఁగి,
పరుషవర్ణములను బాసి కావ్యముదగు, వెలయుమనసు విషయములను విడిచి. 116

క. ధరఁగావ్యమ్ములలోకో। త్తరతత్త్వమెఱుంగువాఁడు తఱచుండఁడు; పు
ష్పరసమ్ముల మర్మమ్ముల। నొరుఁడెఱుంగంగలఁడె మధుపమొక్కఁడు దక్కన్?

క. సరజస్కయు మణియును బాం। డురవర్ణయుఁ గంటకావళులుగలదియునై
పరఁగెడి కేతకి, నోమధుప,। కరమా, సేవింతువె, ట్లకట! సిగ్గిఁడివై? 118

క. తానమ్ములేని రాగము। మానములేకున్నయట్టి మానవపతియున్
దానమ్ములేని హస్తియు। జ్ఞానములేనట్టి యతియు సమిలీ ధాత్రిన్. 119

గీ. పరులసద్గుణగణమది యొరులవలనఁ। గాక తనయంత వే వన్నెఁగాంచు నెపుడు;
గట్టిగా నొక్క చెప్పిన కారణమునఁ। దెలియవచ్చెను కస్తూరివలపుతలఁప. 120

క. పొదయకుమీ గర్వమ్ముం। బరిమళరాజమగు సౌరభముగలదంచున్,
గిరిగుహడాఁగినదీనున్। బొరియించుచు దండ్రినిదియెపో, కస్తూరీ. 121

గీ. దుర్మతులఁ బాయఁగాఁ జేయు, నిర్మలముగఁ। జేయుఁ జిత్తంబు, ఘనతతిమాయఁ జేయు,
మఱియు భూతదయను గడు నెఱయఁ జేయు,। సుజనసంగతిఁ గనరాని శుభము లెవ్వి?

క. నిరతము పరోపకృతిరత। త్వరములు విమలములునగు నెపల్ గలుగుమహా
పురుషులపలుకులు మందుల। కరణిన్ దోఁచెడిని మొదలఁ గటువులయికడున్. 123

గీ. తేఁటిమాటువలిఁ బాడుపాటలందు। దననుతుల్ వినఁబోడమిన వినయమునను.

దలలుపంచెను నేలకుఁ దగులునట్టు। లవనిసుహాకులమిక్కాననని తలంతు- 124
గీ. మృతుఁడు బ్రతుకుట, లోభిత్యాగేచ్ఛఁగనుట,। జారిణిస్వకాంతునందనురక్తయగుట,
పాముసాధువై యుండుట, పాలసుండు। చెలిమిఁదలఁచుటయు, నపూర్వములుధరిత్రి
గీ. ఎంతయుత్తమపురుషుల యింతులకును। లేదువిశ్వాసమనునది లేశమేని;
రాజవల్లభయయ్యుఁ గైరవిణిమధుప। గణముతో రమియించనుగాదె వలచి. 126
క. అడుగంబడకయె సౌఖ్యం। బిడు, నడుగంబడి యొసంగదించుకయైనన్,
వడిఁగొనుసర్వస్వంబున్,। గడవంగారాదువిధి, యకట మనుజులకున్. 127
మత్తకోకిల. చండదోర్యుగకుండలీకృతచాపదండవినిర్గమత్
కాండఖండితశత్రుమండలుఁగాంచినిన్నురణంబునన్,
ఖాండవాటవిమండఁగాధృతగాండివుండయినిచ్చలో
దండపండితుఁ బాండుసూను నెవండలంపఁ డెవండిలన్? 128
క. పండితములు మంజుగతిన్। ఖండితదృక్కంజముల వికాసముఁగూర్పన్,
మండితదిఙ్మండలములు, చండాంశులసత్కరములు, సౌఖ్యములిడుతన్. 129



భా మి నీ వి లా స ము.

2. భాగము.

శృంగారవిలాసము.

---

క. కలుగవొకప్పుడు రాహువు। వలనిభయమ్మను గళంకపాండుత్వమ్ముల్,
కలయన్నెచ్చెలి, నోనె। చ్చెలి, నీనెమ్మోము ముద్దుజిల్కెంపొందున్. 1
క. నీమెయిమార్దవముకడన్।  దామరలతిపరుషములు, మృణాలములైనన్
గోమలములుగా, వరయం। దామెంతటివెన్ననింక నవకిసలయముల్? 2
క. నలినాయతలోచన శ్రమ। జలకలితకపోలతల విచలకాంచనకుం
డలమగుదశావిశేషము। దలఁచిననిపుడును నెవన్ ముదంబిగురొత్తున్. 3
క. చేరువ మునిమాపునఁ, గ। స్తూరీతిలకమిడి, సౌధతుంగాగ్రంబున్
స్మేరాననయి, చెలి, యల। రారంగుముపములు, వెలుఁగు నాశాముఖముల్. 4
గీ. అకట! సాయంతనాంబురుహాభనయన। యారుపిరమంచహసిత, మాయూరుపులును,



అకలంకవిధురమధురాననంబుఁ,। దలఁపనామదినిప్పుడు నున్మాదమొసఁగు. 5
క. గురులకుఁ బ్రొద్దునమ్రొక్కిడి। వరవర్ణిని, వారు, పుత్రవతివగు, మనఁగా,
నరసెంబ్రమోదపూర్ణా। దరయైకడగంటఁ గెలనదయివారు ప్రియున్. 6
గీ. గురుజనుల భీతిచేతనన్నరయునపుడు। పుట్టుచున్నవ్యాకులతనుబూని యొప్పు
హరిణదృశయరవిడిన తామరలఁబోలి। మెఱయుకన్దోయి, నక్కటా! మఱవనెపుడు-
క. సుదతీ, యనుక్రమమునం। బవరామలకామ్రదాడిమశ్రీఁ గొనియు
న్మదురోజమ్ములు గైకొనఁ। గదిరెడిశుండాలశాబఘటసంపత్తిన్. 8
గీ. నీలనీరేజదళనేత్ర, నీయురోజ। పాళిజంబీరఫలముల లీలనేలి,
భాసమానసువర్ణకుంభములనణఁచి,। స్వర్ణభూమిధరంబుతో స్పర్థపూను. 9
క. జలజాయతాక్షి, నీచె। క్కిలియుత్తరదిశయటంచుఁ గీర్తింతుమదిన్,
లలితాలకమగునటరా। జిలుసురువై శ్రవణలక్ష్మి చెన్నదలిర్పన్. 10
గీ. వేసవవెలుంగుఁ గనుఁగొని విడినపోక। ముడినిజేఁ బట్టి పాన్పును విడువఁ బోవు
పొలఁతిమిన్నపొందామరపాట్టఁ బోలు। పొక్కిలిమెఱుంగునామదిఁ దక్కదిపుడు.
గీ. ఆటవేడ్కలోన బోటికత్తియలందు। నడరి నాదుపల్కులనుకరించు
చున్నముగుదదవ్వునుండి నామాటల। వినిమెఱుంగుఁ దీవవిధమునొందె. 12
గీ- చనుటకై నేను వట్టిదోసంబుఁగట్టి। కల్లకోపముతోడఁ గేకలిడుచుండ,
నమ్రమయిబాష్పపూరితనయనకమల। యెలతాంగిననుంబలిమాలఁ దివిరె. 13
గీ. మృగవిలోలవిలోచన దృగ్విలాస। మంతరంగంబుఁ జొరకుండు నంతవఱకె,
స్మృతులుశాస్త్రిముల్ పురాణమ్ములు వెతకివెతకి। పడసినట్టివివేకంబు స్వస్థమగును.
గీ. పతియరుగుదెంచెనని చెలుల్పల్కుటయును। గడపలోనికి నచ్చెరువడుచువచ్చి
వెన్నెలవితానసెపుడు నాకన్నదోయిఁ, 'జల్లఁబఱుపంగలదొ మృగశాబనయన? 15
క. అనినగడనైన తోషనె। ద్దినాంతమున గడపవంక దృష్టినిలిపి నేఁ
జనుదేరఁగ నపుడారసి। యనంతరము రమణివికసితాననయయ్యెన్. 16
గీ. ఇట్టికెంగేలఁ జనుమొనముట్టి తొలఁగి। దవ్వరిగినట్టి ప్రియుమోము దమ్మివంకఁ
గొమ్మకెంపలరారెడు కొనలనొప్పు। కనులకెప్పలవాల్పక కాంచుచుండె. 17
క. గురుజనపరివృత యయ్యున్। గరితనను నళీకగండకండూయనత
త్పరయై హేమలతాసుం। దరభుజమరదోఁపఁ గాంచెఁ దాఁగడగంటన్. 18
గీ. గురుజనుల కడనుండఁగ, సరసిజాత। కోరకమునసే నల్లనఁ గొట్టుటయును,
అతిపవిత్రంపలయుగమించుకంతగదలఁ। గనుబొమల్ వాంచిననుఁగాంచికలఁతనొందె

ఉత్సాహ. వినతిసేయఁ గన్నుదోయి వెలయుఁ గెంపులెంతయున్,
బ్రణతిసేయ, నయయొ, బాష్పవారిధారలొల్కెడిన్,
జనఁగడంగ, నకట, ప్రాణసంశయంబుదోఁచెడి,
న్వనితరో యెఱుంగనీమనం బదెట్లు దేఱునో. 20

మ. కరుణాహీన, మృషాభిభాషణవిదగ్ధా, వీడుమీకోంగు, నా
కరయంగ్రొత్తలెనీదుకూరుముల, పా, మ్మంచున్నదాని, న్నిరం
తరబాష్పాకుల, ముక్తభూషణయు, నాతన్వి, న్సముక్పింపనే
ర్తురెనీవొక్కఁడు దక్కనాకొరులె వంద్రున్, భద్రవనిద్రాయిటన్ ? 21

గీ. తీరమందునఁ గోమలిస్మేరముఖము, । నీరమందున వికచసరోరుహంబు,
నారసిమరందలుబ్ధముగ్ధాళిపోత, । వారమిచటికి నచటికిఁ బఱువులిడును. 22

క. అంబురుహనయన ప్రియువ। క్షంబునఁ దనసవతిరత్నసరమొత్తినచి
హ్నాంబుఁ గనితోడనె భుజా। గ్రంబున నున్నట్టి తనకరముఁ దీసికొనెన్. 23

గీ. తలఁప, జిర, మీషదానమత్కంధరంబు, । దరనిమీలితలోచనసరసిజంబు,
నధికనిశ్వాసభారఖిన్నాంగకంబు, । అంగనాసంగమంబు పాయదుమనంబు. 24

గీ. అలిగిపోయి రెండుయామములకు వచ్చి। ద్వారమందుమాఱువేరునెప్పు
నన్నెఱింగి తరళనయనలోపలినుండి। వచ్చెమెల్లమెల్లలచ్చిభంగి. 25

చ. హృదయమునందు శైవలమునిమ్ములఁ దాలిచి, సారెసారెకున్
బదములుహస్తముల్ శిరముఁ బ్రక్కకుఁ బ్రక్కకునెత్తివైచుచున్,
బెదవులుతామయ్యెప్రియునిఁ జేర్కొనుచుండఁగ, లక్ష్యమూచును
న్నదియిదిబోటికత్తియల యక్కటికమ్మను జిమ్మచూడ్కికిన్. 26

గీ. తలఁతు, నిందుండియేసిజనిలయమునకు। నేగిగురుపరివృతయైన యింతివదన
కమలమును, బరివర్తితకంధరమ్ము। సానతభ్రూలతము, దరహసితయుతము 27

చ. మలయభుజంగమోవమితమారుతపోతము లంతకోపమ
మ్ములుపఱతెంచుచున్నయవి; పుష్పితబాలరసాలశాఖపై
సలలితరీతిగానములు సల్పుచుఁ బ్రాణముగ్రోలుచున్ననీ
యళియును; జీవితాశయిఁకనారయనాకెటుగల్గుఁ దెల్పుమీ. 28

క. జీవితముఁగొనువాఁడవు। గావున హాలహలతుల్యుఁ గానెంతునినున్;
ఏవెడఁగుజనుఁడుపలికెను। నీవుసుధాకరుఁడవనుచు, నీరజవైరీ? 29

గీ. పఱచుపెట్టపావురమును బట్టి, బలిమి, । నఱచుమగపార్శ్వమునకు ముంపఱనుసిల్పు



నన్నుఁగని మెల్లమెల్లనఁ బిన్ననవ్వు। చెన్నలరుమోముపమ్మినంచెను వెలంది. 30

గీ. ఎదుటనున్నదెసలయిరుల నడంచును, । గాకఁ గ్రాగువారికాకనార్చు
నీదుమోము వెలుఁగు, నెలఁతలతలమాని। కమ్మ, తమ్మిసొబగువమ్ము సేయు. 31

క. చనుదోయి నడుమ నాగో। ర్మానొక్కులఁ బులకలెగయఁ, బొడఁగనుచుంజ
వ్వని, జాలకమున మోమిడు। ననుఁగని, తలవంచితత్క్షణమయిలుసొచ్చెన్. 32

క. ననఁబోఁడితనకపోల। మ్మనుమస్వపనానుకూలముగ నిడిహృదయ
మ్మునవాలి నాఁడు సుతాలి। మునియనుపమరాజ్యవిభవమును గీస్పఱిచెన్. 33

క. ముహుర్గ్థితనిద్రాలింత్య। పరిహారార్పిత సుతనుగండపాళింగేలన్
రహింసంటునంతఁ గరుణా। విహీనుఁడయ్యెన్, గటా! రవియునామీఁదన్. 34

క. పరిశీలితనిఖిలశ్రుతి। పురాణములఁ దాపశాంతివొసమకేళీ
భరఖిన్నసుతనుమఖపం। కరుహోద్యద్రుచిరతరనకారమునబలెన్. 35

క. అవలీలనీకపోలము। లవలీవళిములను గోమలతముద్దగొనన్,
గవిసెనుమహాభయమ్ము। ల్లవళాంభోజాతబంక్తులకు నల్లదలన్. 36

గీ. యౌవనోద్గమమునను లజ్జాన్వితములు। శౌర్యబలశీలసౌందర్యసస్పృహములు
నైజనకపుత్రిలోచనాంభోజరుచులు। మొగిడెవికసించె శ్రీరామమూర్తియందు. 37

క. గిరిశునిచాపంబెక్కిడి, । పరితాపంబార్చిబంధువర్గంబునకున్,
నిరపాయంబుగసీతం। బరిణయమగునొక్కయిక్కుమారుం, డకటా! 38

గీ. వరునిచేదృఢబాహుపంజరమునందు। నొంటగ్రహియింపఁబడిననవోఢవధువు
బెదరి, యప్పుడ వలఁబడ్డపిల్లలేడి। కరణిఁ, గంపించుచున్నదగ్గలముగాను. 39

క ఆనితినుపనిషదమృతముఁ। బూనితిగీతార్థమఖిలమునుమది, నకటా,
ఐనం, జంద్రవదనమ। న్మానససదనమును విడిచినదవదు పయికిన్. 40

క. అకరుణహృదయా, ప్రియతమ, । యిఁకనేనీనుఁ గదలిపోవనీయనటంచున్,
వికలాంతరంగయైచెలి। సకియకరాంబుజముఁ గొనివెసంబ్రిలపించున్. 41

క. చిల్లరగవ్వలకొఱకై। చల్లమ్మంబోద్ద్రుగ్రుంకు సమయమువఱకున్
ఇల్లిల్లుఁ దిరుగుగొల్లల। పిల్లకు హరినీలమణిలభించెం ద్రోవన్. 42

గీ. మొనసిరూపారుచిని చాపుకొనఁ దలంచి। హరిముఖాంబుజలావణ్యమానునంత,
నకట, స్వశరీరసహితమానఖిలజగము। నందునరవిందలోచన కరుచిపుట్టె. 43

గీ. నీదునెమ్మేను స్వర్ణసన్నిభమటంచుఁ। బ్రేలు, టక్కట, నిజముగ బేలతనము;
ఆహతాశముతానుహుతాశునందుఁ। బడునెపభవత్తులారోహభాగ్యమందు. 44

గీ. పలుమఱును నుత్సుకత్వమువలన మేళ। నమ్ము, సిగ్గుకతనమీాలనమ్ముఁ, జెలువు
లోచనాంభోరుహములపంక్తు వెలంగుఁ। గరముతరుణులపరిథమసంగమమునందు.
గీ. వనరుహవిలోచనల కుచద్వంద్వమునకు। గౌరవమ్మొసర్పించి లాఘవముఁ జెందు
తరుణపురుషుల ధైర్యమాదరవివేక। హీనమా, యిదె మ్రొక్కుచున్నానునీకు. 46
క. పలుకులతీయఁదనంబున్। విలసద్గతివిభ్రమములు వెలయింతురుమి
క్కిలియున్ సారసదళనయ। నల్గుబాల్యము జారిజవ్వనము పొడసూపన్. 47
క. నిరవధికమ్మగుశోభా। గరిమందనరారుపాలఁతికన్నులు దనరుం
దరళములై తాముపర। స్పరవీక్షానంనవిరహభారమునవలెన్. 48
క. ఉవిదగురుపరివృతయయి యున్న వేళ। మృత్తికాశకలములతో వ్రేయఁబోవు
ననునివారించెఁ దరళితనయనకమల। యైరదనయంత్రితాత్మజిహ్వాంచలమున. 49
క నయనాంచలవిక్షేప। మ్మయినను మున్నెపుడు సయిపనట్టిది పయనం
బయియున్నవల్లభుఁడుమెయి। మెయిఁజేరిచియలముకొన్న మిన్నకయుండెన్, 50
గీ. ముదితమానముచేఁ బెడమోము వెట్టి,। నిద్రవోవుచునున్నదానివలెనలస
కంధరాబంధముత్థితకరమునొప్ప। నిలిపెఁ జెక్కిలిపిఁయుకరనీరజమున. 51
క. నయనపరిఫుల్లకమల। ద్వయమింపలిలోభమునను దరళితచిత్తం
బయి నీలలాటమందువె। లయు నళి కస్తూరికాతిలకదంభమునన్. 52
క. గురుజనులు రాత్రియెట్లో। వరుచెంతకుఁ జేర్చునంత, వనరుహదళసుం
దరలోచన, యిఁకనెయ్యది। జరగఁగలదొయనితలంచు జంకుచునెదలోన్. 53
శా. చింతాక్రాంతమనస్కుఁడంగ జూఁడా, నీచేటుల్ విహీనప్రభ,
లాకాంతుండుం బ్రణయాకులాత్ముఁ, డదియెల్లంబోవనిమ్మట్టు, లో
కాంతారత్నమ, విన్నవింతునిదియొక్కండెన్ మదీయోక్తిమ
న్నింతేఁ, గోపమునూనుమీా, వదనమున్స్మితాంశుఁ డోడించెడిన్. 54
చ. శ్రుతులనలంకరించుకొనుచో మొదలన్ వ్యథమెండుగల్గనీ
తక్కృతిసహితంబుగా మొగముఁ ద్రిప్పుమృగీవ్రశపాణిపద్మచే
ష్టితములఁ బూర్వపుణ్యచయసిద్ధములన్ సుఖియించునీజగ
న్నుతిపదమైన జన్మమునమనున్ గరిమన్, లలితావతంసమా. 55
మ. అరుణించెన్ నిశి, నిండెవెన్నెలలతో నాశాంతరాళంబు, సుం
దరులిండ్లం దనువుల్ విభూషణములన్ గైసేయుచున్నారు, చే
లరో, నీమానముమానవిస్ఫురణను నల్కన్ జేసి, యోచెల్ల! తా



మరలేఁదూఁడులకన్నసన్న మగునీమై గ్లానిమైఁ దూలెడిన్. 56
చ. వెడలెడువేళనింటఁ గలపెద్దలుమంగళవాక్పరంపరల్
వలుకఁగఁ గేళిమందిరగవాక్షమునన్ముఖపద్మముంచియూ
ర్ధ్వలనధరంబువాడఁగ, నురోజతటంబున నశ్రులొల్కఁజం
చలమగుచూడ్కిబాలిక నిజప్రియునారయుచున్న దక్కటా. 57
గీ ఎపుడువల్లభుండుదృష్టి పథమునకుఁ। గ్రూరదైవఘటన దూరమయ్యె,
నపుడెమొదలుగామదంగంబు లెల్లను। స్వీయకృత్యములను జేయఁ జొరవు. 58
గీ. నిదురయుడిపె నాకునిన్న దూరాగత। వల్లభుండురాత్రియెల్లఁ గథల,
మిగులఁ బలుకనోప, మిన్నకుండుము। చెలీ, నీదుజిహ్వలోహనిర్మితంబు. 59
గీ. ఎపుడునూతునొక్కయేణీవిలోచనా। స్నిగ్ధనయననీలనీరజంబు
విగళదశ్రువారిబిందునిరోధసం,। త్యక్తతరళభావతారకంబు. 60
క. ఆనలిననయననాకున్। గానంబడదేని లక్ష్మణా యిఁకనేలా
యీానిశ్చేతనజీవిత। మీానిష్ఫలమైన విశ్వమెల్లన్నాకున్? 61
క. రమణీమణి యిలుసొచ్చుచు। గమనాజ్ఞాలేశలాభకౌతుకమైమా
ర్గమున నిలుచు తరుణనికా। యముపైఁ గృప నయనజలరుహములం బఱపెన్. 62
ఉ. జానకిఁ గానకంపికలుషంబొనరించితినే దురాత్ముఁడన్,
మానిని, యక్కటా, బ్రతుకునాననుఁ బాసి? సుశీలకోటిమో
మేనెటు నూడనేర్తు? నను నేమనువారొకొవారు? రాజ్యమం
భోనిధిలోనముగ్గినను మున్గఁగని, మ్మిఁగనొల్లఁ బ్రాణముల్. 63
క. రమణుండుసపత్నినిశాం। తమునుండి నిశాంతమందుఁదనుఁ జేరుటయున్
రమణీకినయనాంబుజకో। ణములన్ గెంజాయతక్షణమయుదయించెన్. 64
క. వినతిన్ దయితుఁడు క్షమా। పణముఖ్యపదమ్ములైన పదముల వ్రాలన్,
వనరుహదళలోచనలో। చనశోణితకాంతులపుడె శాంతములయ్యెన్. 65
క. లలనలతాలిమి నెల్లం। గలఁచెడిశ్రీకృష్ణరూపుఁ గన్నయువిదబి
ట్టలుక, చిరాగస్స్మృతిమాం। సలమయ్యును, దారిఁబట్టెక్షణకాలములోన్. 66
క. అతివరో, పాంథుండను మ। త్ప్రతికూలుండయిన రాజువలననాకుం
దతభీతియిపుడు సముప। స్థితమయినది వసతినొసఁగితీర్పవె దానిన్. 67
క. మలయానిలమనలమ్మును। విలసన్మణిమంటపమ్ము విపినము నయ్యెన్,
లలనారత్నముతాని। ర్జలమీానమ్మయ్యె, విరహసంతాపమునన్. 68

క. కాలాగురుద్రవమ్మున్ । హాలాహలమనితలంచునత్యంతమ్మున్,
నీలోత్పలమాలికన । వ్యాలికవ్యాలాళియనుచుభావించుమదిన్. 69

క. రమణునిసంకేతనిశాం । తమునకుఁ బోనైతిదుష్టదైవోపహతిన్,
రమణీ, జగతీశుఁడున । న్నమశరుఁడిపుడేమి సేయునోకద, యకటా! 70

క. విరహవ్యాకులమతియై । తరళాయతనయన, దయితదయితాఘ్నని, వం
దురుచున్ జూచును, జెంగటి । కరుదెంచిన, నతనిఁబరిచయమ్ములేనట్లే 71

గీ. జాబిలియడంగు, వెన్నెలచాయమాయుఁ
గలువలెల్లఁదేల్ల మాలిన్యమలముకొనును
దెసలవెలుఁ గొప్పుఁ, జెలులుసంతసముఁ గందు,
రువిద, నీమోముఁదమ్మిఁ దెల్పోందునేని. 72

చ. కరువలిచందనద్రుభుజగప్రవరోచ్ఛ్వసితంబు పోలికం
గరమును వేఁడివీచెడిని, గన్నులనేర్చెడిఁ దామ్రచూత, మీ
పరభృతమున్ హాలాహలమువైచెడిఁ గూజితకైతవంబునన్,
దరుణి, మృణాళిమృద్వి, యసుధారణమేగతిఁ జేయనేర్చునో. 73

చ. గరితలచిత్తముత్సుకముగానొనరించుచు రాత్రివచ్చె, నే
కరణినినాయెదన్నలువఁ గల్గునోకోయిఁకమాన, మంచునం
బురుహదళాయతాక్షి తలపోయుచునుండఁగ నంతలోపల,
న్స్మరనృపునాతపత్రమోయనన్ శశిబింబముదోఁచె వెల్గుచున్. 74

ఉ. ప్రాణవిభుణ్ ప్రభాతసమయప్రభఁ గన్గొనకుండఁ జేయగాఁ
బూనితదీయనేత్రముల మూసితిలీలఁ గరద్వయమ్ముతో,
నైననతం డెఱింగె వికచాంబుజషండసుగంధబంధురం
బైనసమీరణంబున సహస్రకరోదయ మెంతొనూటిగా 75

గీ. దవ్వునన్ విస్మయస్తిమితంబు, కొంత । దళీయఁదరళంబు, బిదపనితాంతకాంతి,
గురులయెదుటికేనేగ హ్రీఘూర్ణతార । కంబు నయ్యెమృగీదృశకన్నదోయి. 76

గీ. పులకితకపోల మిట్టె నేముట్టుటయును । లోనలేనగవొప్పు విలోలనయన
వదనసరసీరుహముమోడ్చి పలికినట్టి । తేనెలొలుకుపలుకులనెట్లు తెలుపనగును.

ఉ. ఎవ్వఁడుమున్నినిన్ను సృజియించెనొ రాజుగ, నోకళానిధీ,
యవ్విధినృద్ధతన్ దనసమస్తబలంబును బ్రాసియుండుటన్,
బువ్వులతుండునాఁ బరఁగు నూత్నవిధాతృఁడు నిత్యలక్ష్మియా



జవ్వనియాననమ్మున కొసంగెడి నిష్ఠత్రిలోకరాజ్యముణ్. 78

ఉ. ఎప్పుడు గానవచ్చె నిఖిలేక్షణకర్షణకార్మణజ్ఞమై
యొప్పెడి నంతసూనుమధురోజ్జ్వలరూపము, నాఁటనుండియున్
గప్పెఁగపోలమున్ ధవళకాంతులు, దీర్ఘములయ్యె శ్వాసముల్,
దప్పెమనఃప్రవృత్తి, కులతామరసాయతలోచనాళికిన్. 79

చ. కులసతి శౌరిపేర్మి ముదిగొల్లల మాటలనాలకించి, వే,
పులకలుఘర్మవారియుఁ గపోలతలమ్మననంకురింపఁగాఁ,
దెలుపుసవిస్మయమ్ముగ, నుదీర్ణవిషాగ్నులఁ గ్రక్కుచున్నచి
ల్వలయెకిమీని పెన్పడగపై నొనరించిన తాండవక్రియణ్, 80

గీ. బాల్యముక్రమమ్ముగాజాఱఁ, బడతిమేనఁ
గంతుఁ డఖిలేశుఁ డరుదేరఁ గడఁగి, పనుప,
నపుడె యమృతేందు సరసీరుహములుమంద
హాసముఖలోచనముల తాదాత్మ్యమందె. 81

గీ. అతివశైవలశయ్యాశయానయై, న । వీనసీతాంశులేఖ చందానఁ గాంతి
శేషయై, చెంతకేగుదెంచినను మధుర । వీక్షణమ్ములనే గారవించుఁ బ్రియుని. 82

క. జితపల్లవ మగునధరము, । నతిలంఘితచంద్రబింబమగునాస్యం, బ
ప్రతిమమగుమేనుఁ దెలుపవు । సతియీజలజాతభవుని సర్గమటంచున్. 83

చ. ఒకక్షణమేమియో వదరు, నొక్కక్షణంబుభజించుమౌనము
న్సకలపదార్థమండలమునన్ నిగిడించును శూన్యదృష్టి, యం
గకములఁ బట్టుగానఁ, డధికంబుగశ్వాసముఁ జిమ్మురావణుం,
డకట, మహీసుతావిరహజార్తిణ గడున్ వికలాంతరంగుఁడై. 84

క. ఉదయించెఁ, జంద్రబింబము, । గదిరెన్ వగపపుడె విరహిగణములకెల్లన్,
ముదమెసఁగె ముదితలెవ్వని । మొదలతలన్ దాల్తు రట్టిపూవిల్తునకున్. 85

గీ. అంబువాహముదయమగు నంతఁగజ్జల । మలినమయ్యె గగనమండలంబు,
రక్తమయ్యె పథికరాజియుల్లము, మాన । వతికపోలపాళి పాండువయ్యె. 86

క. తిలకింపుము కాసారము । జలరుహసంవృతము నసదృశము నిద్రాసన్,
జెలికాఁడ, మిన్నకుండుము, । లలనలనయనములు నన్నలందురఁ జేయున్. 87

గీ. అలుకమానవిప్పుడైనను, భామిని, । యుదయమయ్యెని దెపయోదమాల,
అనుప్రియోక్తులావరారోహనయనాబ్జ । కోణశోణరుచులఁ గొల్లవెట్టె. 88

గీ. సుందరీ, నీవదనమును మందహాస। కందళితమునుగని, యరవిందమనిమి
ళిందసందోహముఁ, జకోరబృందముతోఁగ। విందనియు, డెందమందునానందమందు.
గీ. హాసమనరాదు రుచిరవికాసమిద్ది,। ముఖమనఁగరాదు సురభిళపుష్పమిద్ది,
స్వర్ణఫలయుగ్మమిది స్తనద్వయము గాదు,। భ్రమరభజనీయ లతయిది రమణిగాదు.
గీ. భండనాభిముఖహతభూపతివిభిన్న। మధ్యవివరోన్మిషన్నభోమలినభావుఁ
డుగ్రకరములభువినేర్చుచుదితుఁ డయ్యె। వీఁడెరవి, చంద్రుఁడనుమూఢుఁడేఁడివీని?
గీ. లలనకనులస్వరూపంబునలువుఁదెలుపుఁ। గాదదిహాలాహలంబు నిక్కంపుసుధయు;
కానిచోఁ దన్నిపాతనమైనతోనె। యేలయువపూరుషావళిసోలు, నలరు? 92
గీ ఎందుమధుకరంబో, మృగమో, విలోచన। మో, యొకండువెలయుచున్నదట్టి
యిదిపయోరుహంబో, మృగధరమండల। మో, మరాళయానముద్దుమొగము. 93
క. సువిరళముక్తాతారవు,। ధవళవిభారాశిభాసితదుకూలజ్యో
త్స్నవు, వదనపూర్ణశశిబిం। బవు, రాకవు, నీవువాస్తవము, లలితాంగీ. 94
గీ. అప్రతిమరూపనీర, లోలాక్షిమీన,। నాభికావర్త, నీలవేణీభుజంగ,
సత్పురుషనికురుంబమజ్జనపదంబు,। నైనయిత్తరుణీధుని యధికవిషమ. 95
క. రమణీ, నీవదనసరో। జమునన్ శోణాధరాంశుసంభిన్నములై
విమలతమదంతకాంతులు। రమణీయమ్ములగుఁ గేసరమ్ములమాడ్కిన్. 96
క. లలనా, కేసరములెభా। సిలునీదంతావళీరుచివ్యాజమునన్,
అలకచ్ఛలమున మకరం। దలాలసములౌమిళిందతతులు సెలంగున్. 97
గీ. ఆప్రఫుల్లనీరజాయతలోచన। తాఁదిలోత్తమావిధమునఁ బరఁగ,
నెదఁదలంచిచూడ నిమ్మర్త్యలోకంబు। నాకలోకమట్లె యయ్యెనాకు. 98
గీ. లలన, మృగనాభిపంకాంకమలికతలము। నందుధరియించి యున్ననీయాననంబుఁ
గాంచియానందమంది యెక్కలనువిప్పి। నోరుసారించుఁ జిరముచకోరవితతి- 99
గీ. ఎట్టునీరరుహముహిమముచేతను, దివ। సమ్ముచేతనెట్లు చంద్రబింబ,
మట్లుకినుకచేత నందమెడలుచున్న। యది లతాంగి, తావకాననంబు. 100
క. చలదళిజలజము పోలిక। నలరెడి యాతరళలోచనాననముఁ గన
న్గలిగిన, నిఁకనాకాపూ। విలుతుఁడలుగసిమ్ము దానవెఱపేమిటికిన్? 101
క. అమృతమయమూర్తి యగునా। ప్రమదకు దంభోళికఠినభావునసున్మి
త్రముగాసృజియించినయ। క్కమలభవున్ వికలహృదయుగా నెన్నఁదగున్. 102
గీ. ఫాలతలమునందుఁ గాలేయ తిలకంబు। దిద్దియున్ననీదుముద్దుమోము



రంగెసంగునంతరాసు ప్తధృంగఫు। ల్లాంబుజాయితంబు కంబుకంఠి- 103
గీ. కాంతినద్వితీయుఁ గానిన్నునీవెభా। వించుకొంచుసంతసించెదేల?
ఎవ్వఁ డిమ్మహామహీమండలమ్మెల్ల। నరసినాఁడు, శీతకిరణమూఢ- 104
గీ. అసితచేలాంచలావృతమై చెలంగు। హరిణశాబకలోచన యాననంబు
యామునగభీరనీరపూరాంతరమున। వెలయు మృగలాంఛనప్రతిబింబమట్లు. 105
గీ. తామరసలోచన కపోలతలమునుండి। కుచతటమ్మునఁ బడుచూర్ణకుంతలమ్ము
మించుశశిమండలమునుండి మేరుశిఖరి। పైకిప్రేలాడుకాలసర్పమ్ము పగిది- 106
గీ. పూవుగుత్తులవంగిన తీవెకీవు,। స్తనభరానమ్ర, యెప్పాటసాటియైతో,
పల్లవితవల్లరియును నప్పాటసాటి, స్మయవతీ, యరుణాధరవయిననీకు- 107
క. సుమగుచ్ఛానతలతలన్। గమనీయంబైన యివ్వనముసంతతసే
వ్యమయగుఁ, గుచభరనతలగు। ప్రమదలచేనెదహరింపఁ బడదే, నకటా, 108
గీ. నాదురాకకునిర్భరానందమంది। సరసిజానన రేయెల్ల జాగరముశఁ
గడపివేకువ వదన సౌగంధ్యలోలు। పాళిబోధితయయ్యెఁ దెల్వొందదయ్యె- 109
గీ. భావనాతీత శక్తివైభవసమన్వి। తుండనిప్రసిద్ధిఁ గన్నకంతునిప్రభావ
మునఁ, దలోదరి, నీముద్దుమోముచంద్ర। భావమును గన్నదోయియబ్జతయుఁదాల్చె-
క. అరయఁగ లోచనమీనయుఁ, గరతలపాదతల వికచ కమలయు, వేణీ
భరశైవాలయు, నగునీ! సరసయయిన సుందరాంగి సరసియవుఁ జుమీ- 111
క. మందమతీ, పాంథా, యీ। చందంబుననేలనీవు సంతాపంబుం
బొందెదవు! పయోధరసే। వందడయకొనర్పు, శాంతి, వడసెదు దానన్- 112
గీ. అఖిలభువనసమూహంబునమలకాంతి। మండితముఁ జేయునత్యతిమాత్రతన్విఁ
గనినజనులమనంబులఁ గలిగెసంశ। యంబువెన్నెలయోమించొయనుచునిట్లు- 113
గీ. ఉల్లసత్పాణిపదయయి యొప్పునీస్మి। తాస్యఁగనువారలకు మదులందుఁ బొడమెఁ
బల్లవితవల్లియో, యిదిఫుల్లనీర। జాతపద్మినియో, యనుసంశయంబు- 114
క. నయనాభిరామమగున,। ద్దయితామణి మోముచూచితత్ క్షణమునసం
శయమందిరి నిఖిలజను। ల్పయోజమో, చంద్రమండలంబో, యనుచున్- 115
క. కనకద్రవశోభాకాం। తమకాంతనుగూడియున్న దాశరథింగ
న్గొనిచాతకపోతకము। ల్వనినాడెఁ దటిత్సమేతవనదభ్రాంతిన్. 116
క. వనితయనియీమెనెల్లరు। ననియెదరు జనంబు, లట్లయందురుగా, కే
మనమునఁ దలఁచెదనిదియా। వనవత్పురుషాళినోముపంటయటంచున్- 117

క. దరహాసభాసురాస్య। స్వరవర్ణిని చటఁ గాంచినవియై యిందిం
దిరములును జకోరములుం। బరతరసంతోషభరితభావములయ్యెన్- 118
గీ. ఆస్యకమలముచే దరహాసలేశ। మేని మిషమందు నీవు వహింతొ, యింతి
యానిమిషమందె పంచసాయకునిచేత। నఖిలజగము జితమ్మయ్యె ననితలంతు. 119
గీ. యమునలో నరమున్గిబిట్టార్చుచున్న। యవిబకమ్ములు! పగఁ జేసి యంధతమము
చేత మ్రింగంబడుచుఁ జంద్రశిశునికాయ। మార్తిఁ గుయ్యిడుచున్నదియని తలంతు 120
క. తరుణియురోరుహయుగళము। పరస్పరాసంగసౌఖ్యభరితం బైపీ
వరతరమయ్యెఁ, దదున్నతి। భరియింపక నడుము స్రుక్కఁబడె, ననితలఁతున్. 121
క. సకియరో, వదనేందుద్యుతి। నికరమటం బర్వ కునికి నిఖిలజగన్మో
హాకరఘనతిమిరము భవ। చ్చికురాకృతి నెసఁగుననిమది భావింతున్. 122
గీ. వనజముకులాళి కుత్తుకబంటి నీట। రాత్రిపగలు దివాకరారాధనంబు
సలుపుచు విలాసవత్యురోజత్వలబ్ధి। కయి తపంబాచరించుచున్నయది యొక్కొ.
గీ. ఓవియోగిని, తీవ్రవియోగవహ్ని। కుండమగు నీహృదయమునఁ జండతరము
గాఁ దపించుచునుండె ముక్తాసరంబు। ప్రియజనాసంగసుఖసమాపేక్షఁ బోలె- 124
గీ. వికలుఁడుంబోలె విధి నిన్ను పేక్షసేసి। కాంతిహీను శశిన్ రాజుగా నొనర్చు
టరయ లావణ్యనిధియాత్వదాననము స్ఫు। రించి పెను మోహమందె నటంచుఁదోఁచు.
క. లలనా, వక్షోరుహమ। ధ్యలసద్రత్నచ్ఛలమున ననురాగసమా
కలితమ్మగు నీచిత్తము। వెలువడెఁగాఁ బోలుఁ బ్రియుని వీక్షింపంగన్. 126
క. మదదంతావళిగామిని। వదనవ్యాజమ్మునఁ గువలయప్రియుఁడే
యుదయించెనొక్కొ నెఱపుచు। సుధాంశుజాలమ్ము నివ్వసుంధర నిండన్- 127
క. తిమిరమ్మును కౌముదియున్। గమలమును సుధాకరుండు గంధఫలియు వి
ద్రుమమును నెపుడేఁ గూడిన। సమమనఁగావచ్చుఁ గళలసకి మోమునకున్. 128
గీ. శయ్యమునఁ బ్రియుండు, నెచ్చెలీ, విడువు వి। పాదమనుచుఁ బలుక సకియొక పుడ
కన్నుదోయినుండి కడుబాష్పధారయు। మనమునుండి మానమును దొరంగె. 129
గీ. అసమసాయకుని మహారాజ్యపట్టాభి। షేకమె తీఁగితా సుధాకరుండు
ధారుణీతలము సుధారసమునఁ బూయు। చున్నపగిది దోఁచుచున్న దిపుడు- 130
గీ. పింఛదలకభారవృతమయి యొప్పారు। హరిణశాబనయన యాననంబు
లీలఁ గనిభ్రమన్మిళిందసందోహమై। తనరు నీరజాతమును స్మరింతు- 131
గీ. గురుజనములతోడ నరుగుచు దరహాస। కందళాంచితాస్యకమలయగుచు



నింతి కంధరమ్మొకింత ప్రక్కకుఁ ద్రిప్పి। చూచెనద్దిజగము సొచ్చిడుస్సె- 132
క. కనుఁగాక ఖంజనమ్ము। ల్వనితామణికన్నుఁగవ విలాసము, రుచిరా
ననమున కస్థిరసంప। ద్వనజాతమ్మెట్లు సాటినచ్చుఁ దలంపన్- 133
గీ. చందనమ్మృణాళశైవాలమందమారు। తాంబుజోశీరములు, విరహమునఁ జేత
నమ్ముఁగోల్పోయినట్టి జనమ్ములందు। శీతలత్వము లేక ప్రతీతిఁ జెందు. 134
క. దిననాథుండు ప్రభాత। మ్మున నిజకరముల స్పృశించి ముకుళీభూతా
ననయగు పద్మినికి విబో। ధనమొనరించుచు నెసంగుఁ దతరాగమునన్- 135
ఉ. ఆనతయై నితాంతమధురాలపనమ్ముల నెంత వేఁడిన
న్మానకదూరదేశగమనంబునకే నలుకన్ గడంగఁగా,
మానినియాక్షణంబున నెమార్గనిరోధమొనర్చె, నొండువీ
ల్గానక ప్రేలిసన్నలమెలంగెడి పెంపుడుఁ బిల్లికూనచే.
గీ. విషమశరచాపమహిమ నిర్విఘ్నమయ్యెఁ,
బాసెఁ దిమిరముతో నెప్పపాటు జనుల;
కువిదనీమోము సుధఁజిక్కుచుండెఁ; బొండుఁ
జేలదోఁచునొ దినదినమీవిధుండు. 137
గీ. మింతు రెంతయు, యౌవనవంతులకువి। వేకులకునైన శస్త్రిమ్ములేక హృదయ
భేదనము సేయు జాణలు, విపులకపట। మయమధురలీల లసితాబ్జనయన, లుర్వి.
గీ. జవ్వనము విలాస సదనము పూర్ణసు। ధాంశువదన కెప్పుడంకురించె,
నపుడె యువజనాళి యంతరంగములు వ। హ్నిప్రసక్తిలేకయె రియఁ దొడఁగె. 139
గీ. కనదుకను లెత్తి, నగుచుఁ బల్క, దిదిగాక
కనుబొమల్ గూడముడుఁచు నీకథలు విన్న,
నని ప్రియునకింతి సవతికథను వచింపఁ,
దనపయింగల రాగబంధంబు సడలె. 140
గీ. హాలహాలమువలె బడబాగ్నిఁ బోలె। వ్యాళనికరముతో మకరాళితోడఁ
గలసి పెరిఁగిన యామినీకరుఁడునరుల। కుసుఖము తోఁచఁగించువాఁడు గాకుండు నెట్లు?
గీ. నరునకుత్తమపత్ని పుణ్యమున నబ్బు; । నామెకుదయింతురు పవిత్రులగు సుపుత్రు,
లాసుతులచే నొదవు నిత్యమమలయశము; దానశాశ్వతస్వర్గపదవి లభించు. 142
గీ. దొరయె యైనను యాచింపఁ దొడఁగునేని
తోనె లాఘవమొందు, నో తోయజాక్షి

అధరమునునేను బ్రార్థించినంతలోనె
విముఖివగుచు నిరాశుఁ గావించితీవు. 143

గీ. అపుడజలపూర్ణకుంభంబు హ్రదమునుండి। తెచ్చుచున్నట్టినీదుతత్తీరకుంజ
గూఢసురతోత్సవము నెఱుంగుసుమనోభ। వుండుభగవానుఁ డొక్కఁడపూవుఁబోఁడి

గీ. పాంథ,నీవలెనాప్రాణవల్లభుండు। పథికుఁ డైక్లేశములుద్రుమావళులఁ గడపు
చున్నవాఁ,డేనుజీవించియున్నదాన,। నింతకంటెనుగుశలమింకేమిగలదు? 145

క. లలనాయేలకృశించితి?। తలపెట్టఁగనేలనీకితరకథ; లైనన్
దెలుపుమునామదమునకై;। తెలుపంగలదింటనీసతీమణిపాంథా 146

క. వనితా, నీకుపమానముఁ। గనకెప్పుడుగానిమిగులగర్వింపకుమీ,
వనములలోనెన్నెన్నో। తనరారునుఫలభరానతల్ రుచిరలతల్. 147

గీ. క్రొత్తకాంతినింపుగులెక్కుడి నీమోము,। కన్నుదమ్ములకు వికాసమొదవె.
క్షితిఁ బయోదమయముఁ జేయుచునీలమే। ఘుంబదెచటనేనిఁ గానఁబడెనె? 148

గీ. సంజమొదలుగరవి నుపాసనమొనర్చి। వారిమధ్యమ్మునందుఁ దపంబుచేసి
జలరుహంబదియించుక సామ్యమందె। హరిణలోచన, యిపుడు, నీయాస్యమునకు.

క. సుందరి, నీవదనంబున్,। మందస్మిత మధురముగ నొనర్చెద వేనిన్,
జందురుసామ్రాజ్యమయో,। యందెడిని సమాప్తి నిపుడయనుచుఁ దెలియుమీ. 150

గీ. మత్తుఁ దూరకెంతొ మధురముగానవ్వు,। లోననల్ల నేమొ కానిప్రేలు,
నఖిలమైనజగము హాల్లకాయితముగా। నెల్లయెడల శూన్యదృష్టినెఱపు. 151

గీ. మధురసమ్ముకంటె మధురమానీమోవి। నునుపునాదువదనమున లతాంగి,
పట్టుకొనుము నాదుపాణిపద్మముకేలఁ। బపపపడితి, నహహ, పుపుపుపుడమి. 152

మ. అలఘూపాయము లెన్నొపన్నియెటులో హర్మ్యాగ్రిముంజేరి, యం
దలినవ్యామృతఫేనకల్పసుమనస్తల్పమ్ము నందొంటిమైఁ .
జెలువారన్ బవళింపలేపి, చకితాక్షిన్ స్మేరవక్త్రాబ్జ, నూ
ర్పులతోఁ గౌఁగిటఁ జేర్చురాజరమణిన్ బుణ్యాత్ముఁడిద్ధారుణిన్. 153

క. అరిగినలుగడల మధుర। స్వరములతోఁ బాడుఁ, జేరువకుఁ బరువెత్తున్,
మరలున్, గిరగిరదిరుగున్,। సరోవరములందు లాలసమధువ్రతముల్- 154

గీ. ఎంతయనురాగ భరమున నిందుసుంద। రాననమునేను సేవించినానొ, యంత
యింతితత్త్వకథయుఁ బోలెనేకరసునొ। నర్చెనన్నింటినుండియు ననుమరల్చి- 155

క. వాఁలుంగనుగవతోని। ల్లాలెచ్చటఁగానఁబడదొ, యయ్యది, యఖిల,



శ్రీలంబూర్ణంబయినను,। వాలాయమువనమకాని భవనంబెట్లొ? 156

గీ. వల్గదలకాళిలోలదృక్పద్మలీల। నిఖిలజనములచూడ్కులఁ నిలువరించి,
సంజతఱిఁ గాంతునింటికిఁ జనుచున్న। యింతిగతి యేనిమదివారియింపకుండు?

గీ. విమలరదకాంతికాంతమ్ము, వికచజలజ। సంపదపహారకమ్మును సాంద్రసుధము,
నగుయువతి మోము సృజియించి వ్యర్థుఁజంద్రు। నేలదూరీకరింపఁడో వృద్ధుధాత?

క. అనురాగాఢ్యముఁ జతురము। ననుకంపాన్వితము సాధుతార్ద్రమ్మునునౌ
వనితమనోవ్యాపార। మ్మనయముహరియించునంతరంగము, నయయో. 159

గీ. ముంగురులు వ్యాళశాబకములకు బోఁటి,। కనుగొనల్ వాడిగలసాయకములపాటి,
తానుజపలకుసాటియై తనరుబోఁటి,। సౌఖ్యసాధన మెట్లగుజగతి, నకట. 160

క. కోమలి, మాధుర్యము న। ద్రామకృపయునెందు మున్నదనరెనెపుడు, నీ
యామోముననయ్యేదన। యొయ్యమఱియొకరీతి తోఁచుచున్నదియేలా? 161

గీ. అనిశమును జూపఱకు నయనాభిరామ। మైపాలుపుమీఱునీసస్మితాస్యమునకు
నిశివినిస్సరల్లక్ష్మియౌ నీరజమ్ము। నెట్లుపోల్పఁగవచ్చు నొక్కింతయేని? 162

క. సుకుమారతరములగునం। గకములనక్కలికి విరులకలిమిహరింపన్,
వికలముఁ జేసెడిసుమసా। యకుఁడు శరావళులనాదుప్రాణ, మ్మయయో. 163

గీ. పృథునితంబభారముననమ్మృదుపదాబ్జ। డయ్యుచున్నది త్రోవవెంటఁ జనుచుండి,
అక్కటకట, తదీయరూపాతిశయముఁ। గాంచిడయ్యుచునున్నాఁడఁగలఁగిమదిని.

గీ. మధురకేతేరఁ గడఁగనమ్మాథవుండు,। ప్రాణభారార్తలగువ్రజభామినులకు
నిండుపున్నమప్రలయవహ్నియయితోఁచె.। మందిరాభ్యంతరమువార్ధిమధ్యమయ్యె.

చ. అలిగిలతాంగి కేళిగృహమందుఁ బరుండఁగనొయ్యఁ జేరినె
చ్చెలులనుసైగలన్ దొలఁగఁజేసి సురంటిని వీచుచున్నన
న్దెలిపియుఁ, దానెఱుంగనిగతిన్ గనుదమ్ములు మోడ్చియోసఖీ,
యలసితివంచు నాకరము నానుకొనెందనపెన్నురంబునన్. 166

గీ. గతియుబాల్యమ్ముతోనె మందతనుబొందె,। మనముతోడనె రక్తమైతనరెమోవి,
మఱియునమ్మృగలోచన పిఱుఁదుపుష్ప। శరునితోడ సర్వాధికగురుతఁగాంచె.

క. కలదో లేదోయూపిరి,। సలుపుపడియెఁ జూపు, వలిగొనియెనంగంబుల్;
చెలికథ మిత్రమ, యియ్యది,। తలఁపకుమతి, యొద్దియే నితరకథఁ జెపుమీ. 168

గీ. సీతచేయి శ్రీరాముఁడు చేతఁబట్టు। స్వేదకంపాన్వితంబయి చెన్నుమీఱె,
మంచుచేఁ బెనుగాలిచే సంచలించు। ప్రాతరంభోరుహంబుశోభనుపహించి. 169

గీ. విద్రుమం బెంతయొ ట్టిదై వెలయుచున్నఁ, । జివురుటాకెంతమృదులమై చెలఁగుచున్నఁ
దావకాధర, మబల, యెంతయును గ్రిందు । వఱుచునీ లేంటిమాధురీ వైభవమున-170

క. పరిభూతమణిగణమ్మగు । సురతాంత స్వేదబిందుసుషమమ్మనఁ, బం
గరువన్నెఁ దనరునోసలును, । బరస్పరముసొంపుఁ గూర్చె భామినియందున్. 171

గీ. అన్యపురుషదృక్పాతశతారవాతికి । నలికిజానకిప్రియుహృదయంబుఁ జేరె,
నన్యవనితాభుజంగీమహోగ్రయమున । శీఘ్రముకాంతహృదయమున్ జేరెనతఁడు.

గీ. అంగములనిచ్చిపురుషులప్రాణములను । గొందు వేదనయుచితమా, గోమలాంగి,
అట్లుగాక విలోచనాగ్రాంచలంబు । నొసఁగి యుసురులు గైకొంటయొప్పరుసుమి.

గీ. విజితమౌక్తికశ్రీయయి వెలయురదన । పంక్తిసహవాసమున మోదభరితమయిన
నాసికనుగ్రిందుపఱుచుచున్నయదినీదు । ముత్తెమిప్పుడుసాహస స్ఫూర్తిదనర. 174

గీ. నాసికాలంబమానముక్తాసమేత । మైనయకామినీమణి యాననంబు
చెన్నలరుచున్నయది బుధశ్లిష్టమైన । విమలరాకాసుధాకరబింబమట్లు. 175

గీ. మరలమరల నీగౌరిమమరసికొనుచు । ముగ్ధ, చటుకునగర్వముఁ బొందఁ బోకు,
స్వర్ణరాసులుఁ భవదంగవర్ణభాసు । లివెకనుముదొర్లుచున్నవి యింటనింట. 176

గీ. స్వైరులగు కవివరులు వక్షోరుహముల । తోడమాతంగకుంభముల్ దొరయసంగ,
నాదరముమెయి నెబ్భంగినాలకింతు? । వింతులుయథార్థబోధవిహీనలుసుమి. 177

చ. కవుఁగిటవల్లభన్ బొదివి, కామినికిన్కఁ దిరస్కరించుడున్,
ధవుఁడు పరాఙ్ముఖుండయి వితాకున శయ్యనువ్రాలియుండఁగా,
నువిదయితండు నెవ్వగపునొందెనోయంచును గాందిశీకయై,
కవుఁగిటఁ జేరిచెన్ దడవుకాంతుని మోమునముద్దువెట్టుచున్. 178

గీ యదుతనూజానిఁదిలకింపవదనశీత । కరులఁ జేలాంచలమ్ములఁ గప్పకొన్న
వ్రేతలకుఁ బుష్పబాణసంజాతకంప । మునకాంచమ్ముగాఁ బోకముదులుజారె. 179

గీ. అధరసహవాసమునఁ జేసియరుణిమమునఁ । గమలలోచనరదనపాండిమముమఱుఁగు
పడియు, నిర్మలహాసమువలనఁ దోడు । గాంచినదియయ్యు, మరలవికాసమందె. 180

గీ. సరసిజోదరసోదరసౌరభంబు, । నధరితసుపక్వబింబఫలాధరంబు,
మణినిభరదమ్ము, నైనయుష్మన్ముఖమున । నెట్లుతములముగనఁబడు, నింతి, చెపుము.

క. కెలననెశయసించియు వాం । ఛలుసఫలము సేసికొనఁగఁ జాలనిదై తో
య్యాలియరమోడ్చిననయన । మ్ములఁ గనుఁగొనుచుండె రమణుముఖపద్మంబున్. 182

గీ. వదనకమలసౌరభంబును గాంక్షించి । యేగుదెంచినట్టి భృంగములను
నధరసుధనుగోరినట్టి నన్నునదల్చె । వామనయనకోపపరుషదృష్టి. 183

శ్రీ రస్తు.

# భామినీవిలాసము.

## 3. భాగము.

## శాంతివిలాసము.

---

గీ బహులవిషయాటవీజ్వాలజ్వలనతప్త । మైననామది శ్రీరమ్యమగుముకుంద
మధురవదనసుధాకర మండలమ్ము । నెదురను జకోరమట్లయి యొసఁగుఁగాక! 1

గీ. అధికచింతాగ్నితప్తుఁడనైననన్నుఁ । జల్లఁబఱుపుము, శ్రీనేత్రజలజసదన
ప్రాతరంభోజకాంతి గర్వమ్మడంచు । లోచనముల జగత్త్రియీరోచనముల. 2

చ తలఁచినయంతనే జనులతాపము సత్కృపఁబాపునట్టిదై,
నిలుకడగల్గు మైజిగులనించెడి మించులఁ గూడుకొన్నదై
వెలయు కళిందజాతరుల వ్రేలునపూర్వపుమేఘమాల ని
చ్చలుఁ నుమదీయచిత్తమున సంగతమై చెలువొందుఁ గావుతన్? 3

మ. యమునాతీరవనాంతరమ్మునకుఁ జాయల్ గూర్చుచున్ బ్రాణిబృం
దముగత్యాగతిఖేదమున్సతతమున్ దారిన్నివారించుచున్
గమనీయాకృతినొప్పుచున్ బహులతాగ్రామావృతంబౌతమా
లమహీజాతముమద్భ్రమమ్ములను వైళంబార్పుఁ గాకెంతయున్. 4

మ. భువనంబంతయుఁ గాంతిరూపకసుధాపూరంబునన్ నించిమా
నవతాపత్రయమెల్ల నొక్కత్రుటిలోనన్ దీర్చుచున్ నమ్రిదా
నవవిద్విణ్నికరావృతమ్మగుచు బృందాకాననావాసమౌ
నవజీమూతము నాదుస్వాంతమున ధ్వాంతమ్మన్నివారించుతన్! 5

గీ. గ్రీష్మచండాంశుకైవడి భీష్మతాప । మయిసంసృతిఁ దప్తుఁడనైననాదు
వేదనన్ బాపుఁగావుత వృష్టివరుఁడు । ప్రావృషేణ్యంబయిన వారివాహమట్లు. 6

ఉ. పారములేనియీవిషయబంధురకానన మార్గఘోరసం
సారమునన్ నిరంతరముఁ జాలభ్రమించి నలంగియున్ననా
యారటమెల్లనూర్యతనయాతటినీతటభాసమానమౌ
శారితమాలభూరుహము శాంతముగానొనరించుఁగావుతన్! 7

గీ. మన్నపుఁ బ్రియంగులతచేఁ దమాలమట్లు । యబ్ధిసుతచేసమాశ్లిష్టుఁడైనదేవుఁ
డబ్జనాభుఁడు నాహృదయమున వెలయుఁ । గాక నామేను వ్రాలెడికాలమందు. 8

క. పాపునుగావుత నాసం। తాపమ్మును నయనములకుఁ దతసంతోషం
బాపాదింపఁగ జెంపఁగ। నోపునొకానొక్కనవపయోదాళిపడిన్. 9

శా. ఏవిద్యన్ మధురోక్తులన్ దెలిపితో, యే, స్వప్నమందేనహం
భావావిష్టుఁడనై, యలజ్జుఁడఁ, దలంపన్ దాని, నట్లయ్యు, నన్
నీవాఁడంచు భరించుచుందు విటులెన్నే నేరముల్ సేసిన,
న్దేవా లేఁ డిఁక నన్ను మీఱుజడుఁ డున్ నిన్మిఱు పేర్మాఢ్యుఁడున్. 10

చ. అరుగురసాతలంబునకు, నాకపురమ్మునకేగు, మేరుభూ
ధరమును నెక్కు వారిధులు దాఁటుము, కోర్కులుదీరవప్పుడున్;
బరువడి నాధివ్యాధియును బాసిసుఖంపడఁ గోరుదేని శ్రీ
హరియను నౌపధంబుగొను, మన్యములైనశ్రమంబులేటికిన్? 11

గీ. వెలవెలఁది బింగళను నజామిళునిఁ బతితు। నేలినట్టినీ, కక్కట, యెపుడుగాని,
భవమరుస్థలిలోఁగాని పడుచున్న। యేనుపేక్ష్యుఁడగానుసుమీ దయాబ్ధి, 12

చ. పలుమఱుసంస్మృతిన్ బొరలి పాలును జక్కెరగోస్తనీఫల
మ్ములుఁ జవిచూచి, తద్దివికిఁ బోయి సుధారసమాని తందముల్
గులికెడురంభమోవియును గ్రోలితి, వెందును గృష్ణనామమం
దలిమధురత్వమున్న దె, యథార్థము సెప్పు, మదీయజీవమా. 13

మ. భవరోగంబునకున్ మహౌషధము, పాపశ్రోణిభృచ్ఛ్రేణికిన్.
బవి, యజ్ఞానమహాంధకారమునకున్ భానూదయం, బార్తిదావృ
క్షవితానంబునకున్ దవానలమహాజ్వాలాళి, కైవల్యహ
ర్మ్యవరద్వారము, కృష్ణనామశుభవర్ణద్వంద్వమెల్లప్పుడున్. 15

మ. విను, మోచిత్తమ, తెల్పెదన్ హితమిదే, బృందావనిన్ గోగణం
బునుగాపాడుచునుండునొక్కఁడు నవాంభోదాభుఁ, డవ్వానిపాం
దునఁబో కా,తఁడుపిన్ననవ్వున నెకాంతుల్ సిమ్మి మోహింపఁజే
సి నినున్ నీప్రియమైన యర్థవితతిన్ శీఘ్రింబహోకార్చెడిన్. 15

ఉ. ఏయదిలోనమగ్నమయి యెన్నఁగరానిసుఖంబొసంగునో,
యేయదికంఠలగ్నమయి యేపడఁగించునొ లోనిచీఁకటిన్,
దీయనకేదిదారిత్రులనుతింగనునో, యదికృష్ణనామ, మా
హ్వాయముగల్గఁగా, రసన, పల్కుము నీవురసజ్ఞవైనచో 16

గీ. పృథివిఁజక్కని పక్షులెన్నెన్నొకలవు, వానిలోజాతకమునందబ్రాంతినాకు,



అప్తమేఘునిఁ దలఁపించునద్దికంటఁ। బడినఁ గృష్ణాభిధబ్రహ్మమెడఁదఁదోఁచు. 17

ఉ. ఎవ్వనిసర్వగప్రతిభ నెల్లజగంబులు వెల్గుచుండునో,
యెవ్వఁడహమ్మటంచెఱుఁగు నెల్లరకున్నిభృతావలంబమో,
యవ్విభునింగనన్ స్వహృదయమ్మునెఱుంగని వారలన్యులన్
నివ్వెఱఁబ్రశ్న సేయుదురు, నేర్తుమెమర్త్యులమాఢ్యమెన్నఁగన్? 18

గీ. హృదయమాకొల్వుగోరితేశ్రీశుఁగొలువు, । తలఁపనభిలాషగలదేని తలఁపుహరిని,
వేడ్కయేఁ జెప్పఁ జెప్పుము విష్ణుకథల,। నిద్రవలదేనినిర్వృతిన్ నిద్రవొమ్ము. 19

గీ. భవనిదాఘుచండాతపబాధితులయి। బల్మినజ్ఞాననిగళంబుఁ బాయఁబుచ్చి
యస్పృహాశీతలాత్మామృతాచ్ఛసరసిఁ। జొత్తురపగతకలుషులు సుకృతులవని. 20

చ. క్రతుముఖకర్మపాశనికరంబునొనర్చు బంధముక్తికై,
మతశతచింతఁ జేసెడిని మానసశాంతికినై ప్రభూతదు
ర్గతిజలరాశిపారమును గాంచఁగ తీర్థములన్మునుంగు, సం
సృతిభ్రమియించుమర్త్యుఁ, డిదియెల్లఁ బ్రమాదభవంబచూడుమీ. 21

గీ. మొదటహరిపాదయుగళంబు ముద్దులాడి। యొలిజంఘులు జానువులూరువులును
నాభిహృదయంబునాలింగనమ్మొనర్చి। యాస్యకాంతులనామదియాడుఁగాక! 22

గీ. మలయపవనునందు నలహాలహాలమందుఁ। జెలువకురులయందుఁ జిలువలందు
మాలయందుఁ దమ్మిచూలియందొకటయి। బ్రహ్మమందుమనను పరఁగుఁగాక! 23

గీ. అఖిలమైనజగము నస్థిరం, బందులో। మిగులనస్థిరంబుమేను మరల,
నట్టులయ్యుదానికైయెంతయోపరి। శ్రమమువడుచునుండ్రు జనము, లకట! 24

క. దినదినము మృత్యుముఖ। మ్మునుజొచ్చుచునున్నలోకములఁ గనుఁగొనియున్
మనస్సేమొ విషయములనుం। డినివృత్తముగాద యిప్పటికిని, గటకటా. 25

గీ. అడఁగుఁగాకరాజ్య, మడిదముపయిఁబడుఁ। గాక, శిరముఁద్రుంచుఁగాకయముఁడు;
ధర్మపథమునుండి తప్పకుండునుగాక। మన్మనంబు లేశమాత్రమేని! 26

గీ. మచ్చిరంబునందు మారుతుఁ డెప్పుడు। జ్వలనశిఖలు రగులుకొలుపుఁగాక,
ఖడ్గధారవైచుఁ గాక, సుమంతయు। నోటరాదుతప్పుమాటనాకు. 27

క. తరణోపాయముగానక। యెరిసెదుదుఃఖానలమున నేలా, జీవా?
ఆరుడేరఁడె యీచేత। స్మరణిన్ శ్రీకృష్ణుఁడొక్కసారెయు నెపుడున్. 28

గీ. బహుళహస్తిఘటాదిసంపదలునాకు। నొక్కక్షణమేనిఁ గల్గకయుండుఁ గాక!
వానిలోముస్గు ధనమదిరానిమీలి। తాక్షులకుహరిపదసేవయబ్బనుగద. 29

గీ. మృత్యువిదె చేరవచ్చె నిద్రించెదేల। యిటువయశ్శేషమున భయంబెఱలినీవు?
అయిన నేమి నిదురింపుము హాయిఁ గెలన। మేలుకొని యున్నదిదె తల్లి మిన్నువాక. 30

క. ధర నేనిట్టటుఁ బలుమఱుఁ। బరుగెత్తుచు నెదను బాధపఱుపఁగనేలా!
పరమేశ్వరుండు హరినా। శిరమందుర్ సంతతము వసింపుచునుండన్. 31

క. మనసా! మనోజరిపుపద। వనజములకుఁ మ్రొక్కు నన్ను భవగర్తమునం
దునఁ ద్రోసెదేల? నశియిం। చునె యింతటితో మబ్బు త్రిశోకము నీకున్? 32

క. మరకతవసుధాధరమో,। తరుణతరమ్మగు తమాలధరణీజమొ, యం
చర సిరిదూరమునన్ దా। శరథింగనుఁగొన్న మునులు సందేహమునన్. 33

గీ. రాముమైజిగిఁ గనినవారలకు మొదట।"యమునయో యిది? కాదు, తోయమయ యద్ద్రి;
మరకతాభ యొ? కా, దదిమధురయగుట। యె?" ట్లనుచు సంశయముగ ద్దెనెల్లరకను

గీ. తోయదచ్యుతచపలయో, ద్రుమముఁ బాసి।
నట్టిలతయో, యనుచు సంశయాత్ముఁడయిన।
వానరుం, డామెదీర్ఘనిశ్వాసమరసి।
నిర్ణయము సేసెను వియోగిని యని పిదప. 35

ఉ. హీనులయిండ్లఁ గల్మి, ధనహీనత విప్రులయిండ్ల, సాధుసం।
తానమునష్టపాట, కుజనప్రతతుల్ చిరజీవులౌట, నీ।
కానితనంబుఁ జూచియలుకన్ గడుఁ గ్రాగుదు, నట్టలయ్యు, నే।
దీనుఁడ నీవు సర్వజగతీపతి వేమియొనర్పఁజాలుదున్? 36

క. ఏవపుఁ బుట్టువుగలమా। యావులు తామపహరింతురను పెనుభీతిన్
గావించితిమత్పథ్యమ। జీవితతికి నివ్విధమున నేమంజూపన్ 37

సమాప్తము.



## బులుసు పాపయ్యశాస్త్రిచేతఁ రచియింపబడిన యితరగ్రంథములు.

1. భాస్కరవిలాసము. నవ్యవచనప్రబంధము. ... 0—4—0
2. ప్రియదర్శన. (శ్రీహర్ష దేవవిరచిత సంస్కృత నాటికకు, తెనుఁగు.) ... 0—5—0
3. పద్యరత్నభాండాగారము (4-5 ఫారములకు డైరక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షనుగారిచే నంగీకరింపఁబడిన పఠనీయగ్రంథము.) 0—6—0

ఈపుస్తకములుగాని భామినీవిలాసముగాని వలయువారు విశాఖపట్టణము శ్రీశారదామకుటముద్రాక్షరశాల మేనేజరుగారికేర వ్రాసితెప్పించుకొనవచ్చును.



# శ్రీ

# సరస్వతి.

ఇది యొకతెనుఁగుమాసపత్రిక.

ప్రతిమాసమునను రెండవవారములో నొకసారి వెలువడును.

ఇందుఁ బ్రసిద్ధాంధ్ర పండితులు రచించిన మంచిగ్రంథములు ముద్రింపఁబడుచున్నవి. పూర్వకవీంద్రులు రచించిన పెక్కుసత్ప్రబంధములు ముద్రింపఁబడినవి, యిపుడు ముద్రించుచున్నారము, ముందుముద్రింపఁబోయెదము. ఇప్పటివారువ్రాసిన నోవలులు చక్కనికథలు నాటకములు చరిత్రములు ప్రచురించుచున్నారము. అక్కడక్కడ చక్కనిబొమ్మలుగూడఁగలవు. ఇదివఱకు మేముప్రచురించిన గ్రంథములు మాయొద్ద నేలకుదొరకును. అందఱకును సులభసాధ్యములు కావలయునని వానికి వెలలుమిక్కిలి తగ్గించినాము. చందాదారులు తామిచ్చు స్వల్పద్రవ్యముతో విలువగలగ్రంథములను బడయఁగలరు. చందా సం॥ 1 కి రు. 3 లు. స్త్రీలకు, బాలురకు, గ్రామోపాధ్యాయులకు సం॥ 1 కి రు. 2 లు మాత్రమే. చందాముందుగాఁ బంపవలెను. పుస్తకములను వి. పి. గాఁగోరవచ్చును. ఇందు దేనినిగాని వలసినవారు కాకినాడ సరస్వతీమేనేజరు గారికి వ్రాసి పొందవచ్చును.

